# న్యాయం

ఆరంకముల సాంఘిక నాటకము





గ్రంథకర్త

బిట్రా ఆంజనేయులు

# విజ్ఞప్తి

ఈ నాటకమును 1925 సంవత్సరమున నా మిత్రులు శ్రీ వెలగా బుల్లెయ్యమాష్టరుగారు ప్రేరేపించి వ్రాయించి పిల్లలతో ప్రదర్శింపజేసిరి. ఇప్పటికి తిరిగి ఆ మిత్రులే మా బజారున భారతకథా కాలక్షేపమును జేయించి శ్రీ త్రిపురనేని వీరయ్యగారి సహాయముతో ప్రముఖులైన వారితో చందాలు వేయించి త్వరలో ప్రచురింప జేయించినందులకు వారికి కృతజ్ఞుడను.

ఆనాడు నాకుగలిగిన కొన్ని సాంఘికవిప్లవముల పురస్కరించుకొని మాష్టరుగారి కోరికతో దీనిని రచించితిని. ఇందుకుగల సాంఘిక ధర్మములు కొన్ని ప్రస్తుత మమలులోనికి వచ్చినట్లు స్థూలదృష్టికి కనబడు చున్నను, ఇంకను సంపూర్ణ విశ్వాసముతో ప్రజామోదమునుహొంది ఆచరణలోనికి రానిమాటమాత్రం సత్యం. కనుక యిందలి న్యాయమును గ్రహించి ధర్మపథమున ప్రవర్తించుట న్యాయమేయగునను భావముతో ఇప్పుడు వెలువరించుటకు పూనితిని. అంతేకాని యే సంఘమునుగాని యే వ్యక్తినిగాని తిరస్కరించుటగాదని మా పాఠకమహాశయులకు మనవి.

గ్రంథకర్త

# నాటక ప్రచురణమునకు సహాయ మొనర్చినవారు.

ఈనామములకు మొందట 'శ్రీ' అనియు, చివరన 'గారు' అనియు చేర్చుకొనవలె

రు 25/ లు యిచ్చినవారు

దాసరి వెంకటరత్నం

రు 10/ లు యిచ్చినవారు

త్రిపురనేని వీరయ్య
పెద్ది సుబ్బయ్య
బండ్లమూడి కోటయ్య
కాసంశెట్టి చినకొండయ్య
గోరంట్ల నరసింహారావు
సయింపు సత్యనారాయణ
బండ్లమూడి వెంకటస్వామి
గోగినేని నాగేశ్వరరావు
త్రిపురనేని వరదయ్య
గోగినేని కనకయ్య

రు 5/ లు యిచ్చినవారు

తాడికొండ సుబ్బారావు
గోగినేని కోటేశ్వరరావు
ధొప్పలపూడి అంకప్ప
మన్నవ కోటయ్య
అల్లంశెట్టి వెంకటేశ్వరరావు
వెంపరాల వెంకటేశ్వర్లు
జొన్నల వెంకయ్య
నందిపాటి సాంబయ్య
బండ్లమూడి రామయ్య
ఆకుల వెంకయ్య
సయింపు పద్దయ్య
ఆకుల నారాయణ
వుమ్మనేని రాఘవయ్య
కోయ నాయడమ్మ
పెద్ది అంకప్ప
గో॥ బ॥ రామయ్య
బండారు రాఘవయ్య
బండారు వెంకటప్పయ్య
ఆలపాటి గోపయ్య
గోగినేని సీతారామయ్య
త్రిపురనేని హనుమయ్య
గోగినేని వెంకయ్య
యినగంటి రామయ్య
నూతక్కి నరసింహనాయుడు
త్రిపురనేని సాంబశివరావు
పుద్ది జితేంద్రియము
యెజ్జు పెదరామయ్య
అల్లంశెట్టి క్రిష్ణయ్య
గోగినేని శేషగిరిరావు
బండ్లమూడి నరసింహము
బండ్లమూడి కోటయ్య
పెద్ది రామయ్య
బండ్లమూడి రామయ్య

# సహాయకులు

౫. వైశ్యులై పుట్టి దాతృత్వవైభవముల
నతిశయించిన యెజ్జువంశాబ్ధిచంద్రు
లధికులా రామమూర్తియు నతులమతులు
వీరి తమ్ములు మహనీయ వితరణఖను
లరయ హనుమంతరావుగా రాత్తవిజ్ఞు
లవని వేంకటసుబ్బరావతుల యశుఁడు
రమ్యగుణశీలి యా కోటిరత్నమటులె
వీరి యగ్రజుపుత్రుండు విమలబుద్ధి
దండిగుణి శివన్నారాయణుండు గూడ
శ్రీనివాసుని పదభక్తి చెదరనీక
భక్తిగాథకు సాహాయపడిరి వీరి
కెల్లసిరులిచ్చి రక్షించు నీశుఁడెప్పుడు.

# అంకితము

గీ॥ సత్యపథమును గాంచిన జననినెపుడు
నాత్మ ధ్యానించుచుండుట న్యాయమగుట
"న్యాయ"మనెడు నీదృశ్య కావ్యమును భక్తి
నర్పణముజేతు కనకాంబిక మృతమయికి.

# ఇందు వచ్చు పాత్రలు

| | |
|---|---|
| రంగారావు | కథానాయకుడు |
| రామశాస్త్రి | రంగారావుతండ్రి |
| గంగాధరశాస్త్రి | సుందరమ్మతండ్రి |
| వెంకటరెడ్డి | గ్రామపెద్ద |
| సుబ్బావధానులు | వైదికబ్రాహ్మణుడు |
| వెంకటదాసు | హరిజనుడు |
| శేషాదాసు | వెంకటదాసుతండ్రి |
| గోపాలరావు, మధుసూదనరావు | కాంగ్రెసువర్కర్లు |
| పేరిశాస్త్రి, వెంకంభొట్లు | వైదికబ్రాహ్మణులు |

ఈరడు, పుల్లడు, నాగులు, సుబ్బడు, జవాను, వెంకటప్ప మొదలైనవారు.

| | |
|---|---|
| సుందరమ్మ | కథానాయికి |
| పార్వతమ్మ | కథానాయికితల్లి |
| కామమ్మ, సుబ్బమ్మ | వితంతువులు |
| వెంకమ్మ, శ్యామలమ్మ | ముత్తైదువులు |

శ్రీరస్తు

# న్యాయం

## ఒకటవ అంకము

### 1-వ రంగము

రామశాస్త్రిగారి ఇల్లు. ఇంటిముందు వసారాలో అరుగుమీద ఈతచాప పరచి యుండును.

రామశాస్త్రి వయసు 60, శిష్టాచార సంపన్నుడు, మీద పండిత కండువ, నీరుకావి ధోవతి.

రంగారావు వయసు 25, ఖద్దరు లాల్చీ, ధోవతి, ఉత్తరీయము, గాంధి టోపి, ప్రశాంత వర్చస్సు. కాంగ్రెసు వర్కరు.

తండ్రి రామశాస్త్రి అరుగుపై కూర్చుండి మాట్లాడును, కుమారుడు రంగారావు తండ్రి మాటలకు సమాధానము చెప్పుచుండును.

రామ: చదువుకొని జ్ఞానం కలవాడవు కావటానికి బదులు శాస్త్రాల కన్నిటికి అపార్థాలు కల్పించి స్వేచ్ఛాప్రవర్తనుడవు కావటం మంచిదే నంటావా?

రంగా: నాన్నా! మనుష్యుని కుండవలసిన ప్రేమను పూర్ణంగా నశింప జేసి స్వసుఖాన్నే చూచుకొని, సాటివారిని హీనపరచకూడ దనటం స్వేచ్ఛాప్రవర్తనమా?

రామ: వారివారి ప్రవర్తనలనుబట్టి పతితులై పోయిన నిమ్నజాతులతో పరిచయ మేర్పరచుకొని నీవుకూడా పతితుడవై పోతున్నావు.

రంగా: పతితుల నుద్ధరించటానికిగాని మేము పతితులం కావటానికి కాదీ యుద్యమం.

రామ: రంగారావు ! శ్రమపడి బి. ఏ. వరకు చదివినవాడవు తగిన ఉద్యోగమేదో చూచుకోవాలిగాని ఇట్లా మాలలతో కలిసి చెడతిరుగుతూవుంటే ఇక గతేమిటి ?

రంగా: నాన్నా ! నా ఉద్యోగంమీద ఆధారపడనేల యిప్పటికున్న మీ పూర్వార్జితం చాలదా ?

రామ: ఇంతవరకు చాలునని ఉన్నదానితో తృప్తిపడేవారెవ్వరైనా ఉన్నారా ?

రంగా: ఈ యంత్రాంగదేవత ఆవేశించటంచేతనే ధనికులకు జీవ కారుణ్యం పూర్ణంగా పూజ్యమైనది.

రామ: కలవారేదో వృత్తులు కల్పించినప్పుడే కార్మికుల బ్రతుకు.

రంగా: అదే అసత్యం. కార్మికుల స్వేదరక్తసారమే మన ధనపురాశి గాని, మన మెన్నడును వారి బ్రతుకుదెరువు కాము.

రామ: అయితే వారిచేతనే మేము బ్రతుకుతున్నామా నాయనా ! నీ వేవో వ్యతిరేక భావాలు చెప్పుతూ శాస్త్రవిరుద్ధంగా సంచరించావా సంఘము మెప్పుకోనదు తెలిసిందా ?

రంగా: సంఘంకొఱకు దేశద్రోహి ని కాలేను నాన్నా !

రామ: సంఘంమాత్రం గుడ్డితనంగా మాట్లాడుతుందా ?

రంగా: ప్రపంచదృష్టిలేక స్వసుఖాన్నిమాత్రమే చూచుకొనే యీ సంఘానికి ప్రపంచ క్షేమమైతేనేమి ? తమ పూర్వాచారాలు నిరాటంకంగా సాగుతూ హీనకులాలనేవారు అజ్ఞానాంధకారంలో అట్లే ఆచంద్ర తారార్కంగా పతితులై యుంటేచాలు.

రామ: కాక వారినిగూడ విద్వాంసులనుగా చేయ గలుగుదువా ? పల్లెయావత్తూ నీ స్నేహితుడు వెంకటుడంతవంటి దేనా ?

రంగా: కొంచె మోపికతో మరికొన్నిరోజులు శ్రమపడితే.

రామ: అబ్బాయి ! ఎంతచెప్పినా వినక కులధర్మం కూలద్రోసితివా ? తండ్రినైన నాకు దూరస్థుడవు కావలసివస్తుంది.

రంగా: న్యాయంతోగూడిన త్యాగం గొప్పది.

రామ: చదివి జ్ఞానవంతుడవై ఏకపుత్రవిషయంలో మమ్మల్ని ఉద్ధరిస్తావని ఆశించుకొనియుంటే, స్నేహాలుమరిగి ఇప్పటికింతవాడవైనావు. ముం దెంతవాడవు కానున్నావో?

రంగా: ఇది దుష్టులతోచేసే స్నేహంకాదు.

రామ: ఈవర కెంతటి గౌరవప్రతిష్ఠలతో నలుగురలో తిరిగినానో, నిన్నుగని నేటికంత తలవంపులతో మెలగవలసివచ్చినది.

రంగా: ధనంతోకాక కేవల సుగుణసంపదలతో లభించే గౌరవం శాశ్వతమైనది.

రామ: ఎంతచెప్పినా వినని యీమూఢత్వం వదిలేటట్లులేదు. ముందు పారజూచుకొని నడువు. తరువాత నీయిష్టం.

( తెర )

## రెండవ రంగము

గంగాధరశాస్త్రిగారి ఇంటివెనుక దొడ్డి. అక్కడ రకరకముల పువ్వులచెట్లు పుష్పించియుండును. దొడ్డివాకిలి ముందు తులశిచెట్టుతో కోట. దొడ్డిచివర బావి. దానిప్రక్క విశాలమైన ఒక నావచాయి.

సుందరమ్మ వయసు 18. బాలవితంతువు. అందమైన విగ్రహము. తలవెంట్రుకలు కలవు. తెల్లని మల్లుధోవతి కట్టుకొని యుండును. బావి దగ్గర బండమీద గుడ్డలు నుతుకుచు పెద్దవిచారముతో నుండును.

సుంద:-

సీ. ముద్దుముచ్చటలతో మోదించు నన్నల
పదినెల గని ప్రక్కకొదిగి నిలిచి
వ్రతవేళలం దన్నివస్తువు లమరించి
కన్నీళ్లుగ్రుక్కుచు కడను నిలిచి
పలువిధ భక్ష్యాన్నములు వండి వడ్డించి
ఏవేళకో కొంచె మెంగిలిపడి
పడకటింటనుగల్గు పనులు చక్కగజూచి
నట్టింటి చిఱుచాప నట్టె కునికి

గీ. బ్రతుకనాయెను విధవల ప్రాయమెల్ల
అడవిగాసిన వెన్నెలై యరుగ నకట!
దైవమా! యింక మాయార్తి దలచి కరుణ
పూని రక్షించువారలు పుడమి లేర?

వంటింటికే కాని మరి దేనికిని కొఱగాని ఈ జీవితంలో అనుభవించవలసిన దేమీ మిగిలి లేదు కదా? ఆడుదాని పుట్టకయే అనర్థకం.

( రంగారావు ప్రవేశం

రంగా: సుందరం! ఏదో గొప్ప ఆలోచనలో మునిగినావు?

సుంద: ఆడుదాననుగా ఎందుకు పుట్టితినా అని.

రంగా: ఏమీ!

గీ. ఆడువారలు లేనిదే యవనియందు
పొసగునే సృష్టి? యెందును పుణ్యసతుల
ధర్మశీలంబులే జగద్రక్షణంబు
వనిత లెంచగ మాతృదేవతలు గారె.

సుంద:— కనుకనే యింతభాగ్యం.

రంగా: అది సంఘం జేసిన దురాకృతము గాని భగవదిచ్ఛ గాదు. నిజం విచారిస్తే

గీ. పూర్వ మాజన్మమును స్త్రీలు పురుషు లొక్క-
పెండ్లితోడనె బద్ధులై ప్రేమమయత
బ్రహ్మచర్యంబు వదలక బ్రతికినారు
నాల్గుపాదాల ధర్మంబు నడుచుచుండె.

సుంద: మీరు చెప్పిన న్యాయం ఈ కాలపు పురుషులలో ఉన్నదా?

రంగా: అది కృతయుగంనాటిమాట. కాలక్రమేణ పురుషులు స్వేచ్ఛా ప్రవర్తనంతో కామతృప్తికొఱకు ఎన్ని వివాహాలైనా చేసుకుంటూ ధర్మాన్ని తారుమారుచేసినారు. కనుకనే భరతమాత యింత నిస్సారపుబిడ్డలను కంటున్నది.

సుంద: అయితే యిక మగవారితోపాటు స్త్రీలెందుకు కాకూడదు?

రంగా: ఎప్పుడో కావడం యేమిటి, ఇప్పటికే యీ బ్రహ్మచర్యోత్పాటన పటవంబైన మహావాయువు భరతఖండములో అన్ని మూలలా వ్యాపించింది.

సుంద: అయితే స్త్రీలు కూడా ద్వితీయాలు చేసుకోవచ్చునని వొప్పుకున్నట్లేనా? 'ఆలోచించి' ఆ ధర్మాన్ని మీరే నడపవలసివస్తే?

రంగ: సుందరం! నన్నేదో అసమర్ధుణ్ణికింద జమకట్టి మాట్లాడుతున్నావే?

సుంద: ముందు సంఘం, వెనుక శాస్త్రం, ఈ యెడకత్తెరను తప్పించుకోగలరా అని.

రంగా: ఈ సంఘానికీ గింఘానికీ లొంగేవాణ్ణిగాను. చదువుకొని విజ్ఞానం సంపాదించినందులకు ఎన్ని కష్టాలనైనా యెదుర్కొని సత్యాన్ని సాధించకుంటే యేమి ఫలము.

సుంద: ఇతరులమాట అలా వుంచండి, ముందు మీ నాన్నగారు వొప్పుకుంటారా?

రంగా: ఒప్పుకోనరు. సత్యమే. కాని వధూవరులకు శాశ్వతంగా వుండదగిన పరస్పర ప్రేమల విషయంలో తల్లిదండ్రుల సంబంధం వుండగూడదు.

సుంద: అందుకనే ప్రేమోదయం కానిదే పసిబిడ్డలకు వివాహం చేయ దగదంటున్నాను. కాని

సీ. "పెద్దవానికి జేయు పెండ్లిలో నిదిగూడ
ముడిబెట్టినను తేలపోవు" ననుచు
"ఈడు వచ్చినమీద నిచ్చగించునొ లేదొ
ఇప్పుడే చేయుట యొప్పు" ననుచు
"ముందువర్షముదాక ముసలమ్మ బ్రతుకునా?
వలదె చూడగ పెద్దప్రాణ" మనుచు
"ముసలి యైతేనేమి? ముడిబడ్డచాలును
ధనము విస్తారంబు దక్కు" ననుచు

గీ. కన్నుదెరవని బిడ్డల గళములందు
నురులత్రాడులు దగిలించి యూరకొందు
రవలగతి లేదు వైధవ్య మబ్బినపుడు
ఎంతపాపమొ యిటుసేయ నెంచరకట!

రంగా: నీవు చెప్పినది తప్పక విచారణీయాంశమే? నిజంగా ప్రేమ మయమైన అనుకూలదాంపత్యంకంటే స్వర్గము లేదు.

గీ. తరుణి చుక్కానిగా జేసి ధవుడు, కర్ణ
ధారుడై ప్రేమకలిత పథంబునందు
నడుపుచుండగ జీవితనౌక గడచు
సరళముగ దాటి సంసారసాగరంబు.

సుంద; ఇట్టి నీతులు ఉపన్యాసరంగాలమీాది కెక్కి బోధించే విద్వాంసులుకూడా, ఆచరణలో తప్పుత్రోవలుత్రొక్కటం విచారకరం.

రంగా; అదే వచ్చిన చిక్కు. చదివినాను చదివినానను కుంటే సుఖం లేదు. చదివినందుకు ఆత్మస్వాతంత్ర్యం సంపాదించాలి. ఎన్ని విపత్తులు సంభవించినా, మానవత్వాని కుండదగిన నీతి నియమాలు చెదరకుండా నడిపినప్పుడే మనుష్యులౌతారు. సర్వ శాస్త్రాలు దేశమే దేవుడంటున్నవి. కాబట్టి విద్యాధికులంతా దేశసేవకొఱకు దేహాలర్పించే నిశ్చయానికి రావాలి.

సుంద; మీారైనా వాక్శూరులేకాకుండా కార్యశూరులుకూడా అయ్యేదరా?

రంగా: అనే ప్రయత్నిస్తున్నాను.

సుంద: అయితే నన్నుకూడా మీా దేశసేవలో భాగస్తురాలినిగా...

రంగ; సుందరం! తొందరపడవద్దు. చిన్నప్పటినుండి ఒకబడిలో చదివినవాళ్ళం. మన మొకరి కొకరం క్రొత్తగాదు. కాని మన కోర్కెలు ఫలించుట కింకా కాలం పక్వంకావాలి. నా ప్రయత్నాలింకా చాలావున్నవి. అవి పూర్తియైనగాని మరియొక విషయమాలోచించను.

సుంద; ధన్యురాలను. మీ యాజ్ఞ కెదురు చూచుచుందును.

రంగా; పరమేశ్వరుడు సర్వభూతదయాళుడు. మన ప్రయత్నం సఫల మౌతుంది.

సుంద; మీ యుద్యమానికి

(తెరలో)

సుందరం! ఎంతసేపైందమ్మా మడిగుడ్డలు తీసుకెళ్ళి! మీ నాన్నగారు వచ్చే వేళైందికదా? ఇక ఎప్పటికాకావాలి వంట!

సుంద; అదుగో! మా అమ్మగారు వస్తున్నది. మీ మాటల సందడిలోబడి గుడ్డలుతకటం ఆలస్యంజేశాను.

రంగా; ఎందుకంత భయం? ఇక్కడ జరిగిన తప్పేమున్నది?

(సుందరమ్మ తల్లి పార్వతమ్మ ప్రవేశిస్తుంది. వయసు 50. చక్కని కుంకుమబొట్టు, పూర్వకాలపు మురుగులు ఉంగరాలు మొదలైన బంగారు ఆభరణాలు, కుప్పడంఅంచు ఖాదీచీరె, రవిక కలిగిన పెద్దముత్తయిదువు. వినుకక్కొంటూవుంటుంది)

పార్వ; వచ్చినపని త్వరలో తెముల్చుకొని రావలెగాని ఇక్కడనే పడుంటే ఎట్లాగమ్మా జరిగేది!

సుంద; వీరేదో మాట్లాడుతుంటే కొంచెమాలస్యమైనది. వస్తున్నా?

పార్వ: వీ రెవరు రంగారావుగారా! తలచెడిన యిటువంటి పిల్లలతో అంత దీర్ఘంగా మాట్లాడుతుంటే లోకు లేమనుకుంటారు నాయనా!

రంగా: లోకానికి తెలుస్తుందేమోననే చెడ్డపనులు చేయకపోవటం. తెలియకుండాఅయితే యెన్నిపాపాలైనా చేయవచ్చునన్నమాట.

సుంద: అప్పుడు దేవునికళ్లు మూతబడతై.

పార్వ: నీతో మాట్లాడటం నాకు చేతకాదు, వయసొచ్చిన పిల్ల? మగవారి కంటిలోపడకుండా ఉండవలసిన యీడు! అందుకని అంటున్నా?

రంగా; నిజమే. భర్తగలదైతే ఎక్కడదిరిగినా యే తొందరాలేదు. వితంతువైనదంటే వీధిలోకి చూట్టానికికూడా వీల్లేదు. భర్తగల దాన్నిగానే చేయరాదు ?

పార్వ; ఏం వేళాకోళం. దానికట్లా వ్రాసిపెట్టివుంది, జరిగింది. ఏనాడు యెవరికి విడబంధాలు చేసిందో ఈ నాడు అనుభవిస్తున్నది. ఇప్పుడు తప్పించటానికి యెవరి వశమాతుంది.

రంగా; వశమైతే తప్పిస్తారన్నమాట.

పార్వ; దేవుడుచేసినదాన్ని ఎవరిచేతాకాదు తప్పించటానికి.

రంగా; ప్రయత్నంచేసి చూడరాదు, అప్పుడు దేవుడేమై పోతాడో చూతాము.

పార్వ; ఏం మాటలబ్బాయి! యివి. ఎవరైనా వింటే నేర్చుకు పోతారు పూరుకో. ఏదో చిన్నతనంలో కలిసిచదువుకున్నారు, పోనీలే వస్త్రమాత్రమేమని అనుకుంటున్నా. ఇలా బోధించటం మొదలుబెట్టినావంటే బాగుండదు.

రంగా; మా బోధలు దేశానికీ, సంఘానికీ మేలుచేసేవేకాని కీడు చేసేవికావు.

పార్వ; ఏవైతేమాకెందుకు, మీబోధనలన్నీ మీయింటివారికి చేయరాదు. చదివినాచిదివినందంవుండాలి. ఇంగిలీసులు చదివితే మాత్రం అందరూ యిట్లాగేమాట్లాడుతున్నారా ?

సుంద; అమ్మా! ఇప్పుడువారుచేసిన దోషమేమున్నది తొందరపడి మాట్లాడకు.

రంగా; సనాతనం అంతగ్రుడ్డివారినిగా జేసింది.

పార్వ; గుడ్డివాళ్లంగాము చూస్తూనేవున్నాం నీవ్యవహారాలన్నీ. ఇల్లంతా మాలకూడుజేశావు, సంధ్యలేదు, జపంలేదు, ఈగుడ్డల తోనేకా భోజనం ఎట్లామనసొప్పిందో మీయిల్లంతా నీమతం లోనేపడింపటగా ? అంతా చెప్పుకుంటూనేవున్నారు.

రంగా: చక్కగా వుదికిన చాకింటిగుడ్డమైల — మన దొడ్డిలో నీమైల నీటిలో జాడించినా మంచిమడి ఎంతసరసమైనమాట.

పార్వ: ఇదేంమాయకాలమో నాకు తెలియటంలేదు. మడికట్టుకోవటం కూడా మంచిదికాదట. ఇంతకంటే యింకాపాపమేముంది.

రంగా: ఎందుకులేదు. అబద్ధమాడితే — దొంగతనంచేస్తే — వ్యభిచారంచేస్తే — లోకుల కొంపలుదీస్తే — తీరనిపాపం తప్పక వస్తుంది. అంతేకాని గుడ్డలలోనుంచి యెలావస్తుందో నాకు తెలియటంలేదు.

పార్వ: ఇట్లాంటి నీతులుచెప్పే పూర్వాచారాలు తలక్రిందు జేస్తున్నావు.

రంగా: మీ యాచారాలు అలాగే నడుపుకోండి, నేను కాదనను. కాని మడి మడి యని సాటిమానవులను హీనపరచిన పాపాన్ని యే పుణ్యంతో పోగొట్టుకుంటారా అని నా సందేహం.

పార్వ: ఇదెక్కడ అఘాయిత్యమయ్యా! ఇలామాట్లాడుతావు. అన్నీ విపరీతార్థాలేతీస్తే, ఎట్లాజరిగేది ప్రపంచం?

రంగా: (నవ్వుతూ) కాదండీ! మీరు కొంచెంశాంతపడి వినండి. మడికట్టుకోవటంలో పుణ్యంలేదు, పాపంలేదు. నడిచే నడవడికలో — చేసే చేతలో వుంటుంది. అయితే యిది దేహారోగ్యం కొఱకు పూర్వం శుచిగావుండండని చెప్పినారు పెద్దలు. అది మరచిపోయి యిదొక్కటే పుణ్యమార్గమని అనుకుంటున్నారు. ఈ పొరపాటు దిద్దుకోవాలి.

పార్వ: (కోపముతో) దిద్దుకోవలసినవరకు ఈవరకే దిద్దుకున్నాం. నీవేమీ దిద్దనక్కరలేదు నాయనా! చాలుగాని నీ వాదం, ఇక వెళ్లు. ఇది మొదలుకొని యెప్పుడూ మా యింటికిరాకు. మా పూర్వాచారాలతో మా జీవితాలు యిలాగే గడిచిపోనియి. సుందరం! పద యింట్లోకి. ఎంత మంచివారైనా ఇట్లాంటి మాటలు విన్నారంటే తప్పక పాడైపోతారు. తెలిసిందా?

రంగా:- మంచిజెప్పి మాటబడటం యెందుకు వెళుతున్నాలే ?
పార్వ:- బుద్ధిమంతుడవుగాని వెళ్లునాయనా ! వెళ్లు.
రంగా:- (వెళ్లుచు

గీ. నీవుచేయునదే గొప్పనీతి యనుచు
యిచ్చకములాడు వారినే మెచ్చుగాని;
సత్యమును జెప్ప మెచ్చదు సమతలేని
లోకమున కిదియొక గొప్ప లోపమయ్యె.

(నిష్క్రమించును

( ఉదికిన గుడ్డలను తీసుకొని సుందరమ్మ, పార్వతమ్మ మాట్లాడుకుంటూ యింటిలోపలికి వచ్చెదరు. )

సుంద:- అమ్మా ! అంత కఠినంగా మాట్లాడవచ్చునా ?
పార్వ:- బుద్ధిలేనివారిని అలా అనకుంటే బాగుపడరు.
సుంద:- బుద్ధిమంతుడేనమ్మా ! చాలా మంచివాడని అందరూ అనుకుంటారు. స్కూల్లోకూడా మొదటిమార్కు లొచ్చేవి. చక్కగా చదివినవాడు.
పార్వ:- అమ్మా ! నీది చిన్నతనం; మంచిచెడ్డలింకా బాగా తెలియవు; నలుగురిలోకి పోవలసినవాళ్లం, రావలసినవాళ్లం, ఈదులోవున్న యిటువంటివారితో మట్లాడినావంటే ఒక చాయునరాదు. లోకం చెడ్డది.
సుంద:- నిజం ఎంతశుద్ధంగా ప్రవర్తించినా మావంటివారి నతిసులభంగా మాట్లాడుతుంది లోకం. మీరుమాత్రం,

సీ॥ వ్యవహారములుదీర్చి వచ్చినభర్తకు
కూడైన బెట్టక కునకవచ్చు
బిడ్డలువద్దని బిడియమించుకలేక
దొంగమందుల నమలంగవచ్చు
పెనిమిటినింటిలో బెట్టి షోకులు జేసి
సినిమాలుక్లబ్బులు చేరవచ్చు

ఉన్నంతలో తృప్తినొందక లోకుల
కొంపలనెన్నెన్నో కూల్చవచ్చు
గీ॥ భర్తలుండిరిగాన యేపాట్లుబడిన
చెల్లిపోవునువారికి చెప్పనేల
ఎంతమర్యాదగానున్న కొంతమంది
మమ్ముమాత్రము చుల్కగా మందలింత్రు.

పార్వ:- నీ వ్రాతకు మేమేంజేస్తామమ్మతల్లీ ! చక్కగా పసుపూ కుంకుమతో కళకళలాడుతూ తిరుగవలసినరోజుల్లో నీ కర్మమిలాకాలిపోయింది. లేకలేక కలిగిన యీ చక్కబిడ్డగతీ యిలాజేశాడు ఆ మాయ దేవుడు. (ఏడ్చును)

సుంద:- మనం జేసుకున్న కర్మానికి దేవుణ్ణెందుకనాలి ?

పార్వ:- నీతో బుట్టిందేకా రంగనాయకమ్మకూతురు సుశీల; మొన్న పండంటి కొమారుణ్ణెత్తుకొని మనయింటికి పేరంటానికి వస్తే మాకీ భాగ్యం లేకపోయ గదా ! అని కంటినీరు కనబడకుండా తుడుక్కున్నా.

సుంద:- అమ్మా ! లోకుల శుభాలకు అంగలారిస్తే ఫలంలేదు. మన మేలుకొఱకు మనం ప్రయత్నించాలి. చూడు నిన్న గృహలక్ష్మి పత్రికలో చదివినాను. మంగళూరట, పదునెనిమిదేళ్ల కన్యయట పూర్తిగా చదువుకొన్నది, భర్తపోతే యిప్పుడు తల్లి దండ్రుల యిష్టముతోనే కాకినాడలో చదువుకున్న వరునికిచ్చి వివాహం చేశారట.

పార్వ:- అయ్యో ! అదేమిటమ్మాయీ ! పత్రికలు చదివితేమాత్రం అటువంటి ఘట్టాలు చదవవచ్చునా ? ఇప్పుడొచ్చినై యీ పత్రికలున్ను ఆడవాళ్లు చదవటాలున్నూ, మా కాలంలో మేమూ చదువుకొనేవాళ్లమే. చదివినా యేవో రామనామాలు, గీతా గోవిందం, ఊర్మిళ వేవిళ్లు ఇల్లాంటివేవో చదువుకొనేవాళ్లంగాని ఈ చదువులు మే మెరుగమమ్మా !

సుంద:- నాన్నగారు వస్తున్నారు.

(గంగాధరశాస్త్రి ప్రవేశిస్తాడు. వయసు 60, ఖద్దరుధోవతి, వుత్తరీయం, గాంధీటోపీ, కండ్లకు జోడు, గాంధీజంలో మధ్యమరకం.)

గంగా:- రామరామా! ఎంత విపరీతంగా మారుతున్నది కాలం.

పార్వ:- ఏమిటండీ!

గంగా:- ఇవ్వాళ బందరునుంచి వొక వుపన్యాసకుడు వచ్చి రచ్చచావడి దగ్గర సభబెట్టినాడు. దేశమంతా వితంతుకన్యలకు వివాహాలు చేస్తున్నారట; ఇక్కడ మీరుకూడా ఆ పుణ్యకార్యానికి పూనుకోవలసిందని చెప్పేసరికి, సభవారంతా ఏకగ్రీవంగా సెబాసన్నారు.

పార్వ:- ఇక మనవూరివారుకూడా యీ శుభకార్యం మొదలుబెడతారు కాబోలు.

గంగా:- అన్నమాటే. గాంధీమహాత్ముడు చెప్పిన అన్నిసంస్కరణలు ప్రారంభించి దీనిని అమలులోబెట్టినా బాగుంటుంది. కాని అవేవీ చాతగావు యిదిమాత్రము ప్రస్తుతం సాగిస్తారట.

సుంద:- నాన్నా! ప్రస్తుతం యీ వివాహాలు నూతనం గావటంచేత యింత యేవగించుకుంటున్నారు. కాని కొంతకాలం గడిస్తే ఇవీ పరిపాటై పోతయి. తలచుకొనే వారే వుండరు.

పార్వ:- ఇదియెంత శాస్త్రవిరుద్ధమైన కర్మమనుకొన్నావు. అన్నిధర్మాలు తలక్రిందై పోవు?

సుంద:- శాస్త్రాలేకాని పాపమెరుగని చిన్నిపాపల యలజడి నెరుగవద్దా?

సీ॥ శుభకార్యముల కేగుచోట యెదుర్పడ
తొలగిపోవుట చూచి దుఃఖమొంది
చక్కగా గైసేసి సరసను గూర్చున్న
యబలల గనుగొని యంగలార్చి

చిన్నిబిడ్డలనెత్తి చెలగి ముద్దాడెడు
వనితల గనుగొని వగచి వగచి
పసుపు కుంకుమలుంచి వ్రతముల నొనరించు
నెలతలగని కంట నీరుబెట్టి
గీ॥ నిత్యసుఖముల కిన్ని కన్నీళ్లు విడిచి
శుభపరంపరలకునెల్ల సున్నజుట్టి
ఇహమునకుగాక, పరమున కెక్కలేక
మధ్యనూగెడు బ్రతుకాయె మాకునెపుడు.

గంగా:- తల్లీ ! ఏంజేస్తాము. మీవంటివారి ముఖాలు చూచినప్పుడంతా కడుపు బ్రద్దలగుతుంటుంది. కాని శాస్త్రమెట్లున్నా సంఘాన్ని చూచైనా భయపడవలెగదా ?

సుంద:- ఇతరులకు చెప్పేటప్పుడు అందరూ శాస్త్రాన్ని దాటకుండానే మాట్లాడుతారు.

పార్వ:- నీకెందుకమ్మా ! యిట్లాంటి విచారణలు.

సుంద:- లోకంకొఱకే. మాటవరుస కంటున్నాను.

గంగా:- అమ్మా ! ఏది యెట్లైనా పురాకృతకర్మను తప్పించుటకు ఎవరి తరం.

పార్వ:- ఈ విచారణలన్నీ తర్వాత చేయవచ్చునుగాని, పన్నెండు గంటలుకొట్టినె ముందు భోజనానికి లేవండి.

( అందరు లేతురు - తెరపడును. )

శ్రీరస్తు

# న్యాయం

—

## రెండవ అంకము

### 1-వ రంగము

వెంకటరెడ్డిగారి యిల్లు. ముందు వసారాలో అందమైన గది ఒక డ్రాయరు, నాలుగు కుర్చీలు వుండును.

సుబ్బావధాన్లు వయసు 50. పింజబోసి మోకాళ్లవరకు కట్టిన ధోవతి. మడత వుత్తరీయం, శరీరమంతటా విభూతి పూతా. స్థూలమైన శరీరం, తెల్లని జందెము.

సుబ్బా:- ఏమండోయ్! వెంకటరెడ్డిగారు! ఒకమాటు యిలావస్తారా!

వెంకటరెడ్డి తలుపు తెరుచుకొని ప్రవేశము

వయసు 40. నీరుకావిధోవతి, మడతవుత్తరీయం, తెల్ల ఆఫారం చొక్కా, బొద్దుగా పెద్దవిగావున్న మీసములు, పెత్తనపు చేతికఱ్ఱ, కిఱ్ఱుచెప్పులు, పెత్తనపు గర్వం.

వెం॥ రె.- ఓహో! సుబ్బావధాన్లుగారా! దయచేయండి! ఎక్కడా దరిశనమ్మే లేదే?

సుబ్బా:- ఇంకా యేందరిశనాలు. ఈ స్వనంఘుపౌరోహిత్యాలొచ్చినై మా బుట్ట పడిపోయింది. పొట్టొకటుండెగా? ఏదో అక్కడక్కడా సంచారం జేస్తున్నా. కాని యెక్కడా ఏమీ గిట్టుబాటు కావటంలేదండీ! ఎక్కడ జూచినా విజానం ముదిరిపోయింది. వెనకటి కాలం కాదండీ! రెడ్డిగారు!

వెం॥ రె:- ఔనండీ! మారిందికాలం. కాని చేసేది యేమీ లేదంటారా?

సుబ్బా:- ఏంజేస్తాం. వారుచెప్పినట్టంతా వొప్పుకోవాలిసిందే. మీ నడవడికలన్నీ తప్పనని వారి వాదన, పైగా ఎగతాళి, బాల్య వివాహం పనికిరాదట, బడితలాగా పెరిగితేనేగాని పెండ్లిచేయకూడదట, గుళ్లూ గోపురాలు పనికిరావట, అంకమ్మలు, పోలేరమ్మలు అసలే లేవట, అంటరానితనంవుంటే కుదరదట, ఇవన్నీ సంస్కారాలట తెచ్చిపెట్టినారు.

వెం॥ రా:- ఎందుకు చెబుతారు. ఇదంతా విదేశపు చదువులతో వచ్చిన పిచ్చేగాని, ఏదీ వొక్కణ్ణి చూపించు ఇవన్నీ నడిపించేవాణ్ణి ?

సుబ్బా:- ఎందుకండీ ! అట్లా అంటారు. వేదాలమీది నమ్మకం పోయింది, ఇట్లాంటి వెన్నో జరుగుతున్నై. మన రామశాస్త్రిగారి వంశం పు ర్వంనుంచి యెంతశాస్త్రమర్యాదగా, న్యాయంగా నడుచుకుంటున్నది. నేటి కేలా మారిందో చూడండి ! కొడుక్కి విదేశవిద్య చెప్పించాడు. దాని ఫలితంగా వాడు వితంతుకన్యను వివాహం చేసుకోబోతున్నాడు.

వెం॥ రా:- ఆఁ, యేమిటీ, వితంతువునా ? ఎవరిపిల్ల.

సుబ్బా:- గంగాధరశాస్త్రిగారి కుమార్తెనట.

వెం॥ రా:- వారికిది యిష్టమేనా ?

సుబ్బా:- ఎందుకౌతుంది. ఆయనా పరిశుద్ధాస్తికుడు, వైదికాచార సంపన్నుడుకూడాను. అయితే నేమి యీ గాంధీమతం వచ్చిన తరువాత వుభయమధ్యస్థంగా తయారైనాడు.

వెం॥ రా:- అయితే మరి యీవివాహం యెలా జరుగుతుందంటారు ?

సుబ్బా:- వీరికి కొంతసంఘం వున్నది. ఎరుగరు ! స్వధర్మనాశకుడుగా బయలుదేరి కాంగ్రెసులో దిగి, ఇల్లూ వాకిలీ విడిచి, సంసారానికి స్వస్తిజెప్పి సన్యాసిగా తిరిగే గోపాలరావు, దేశోద్ధారకమంతా నాదేనని తిరుగుతున్న మధుసూదనరావు, వీరికితోడు ఆ మాలముండాకొడుకు శేషాదాసుకొడుకు వెంకటదాసు, ఇంకా కొందరు.

వెం॥ రె:- ఇంతకూ పిల్లనుబలవంతంగా తెచ్చి చేస్తారన్నమాట.

సుబ్బా:- అంతే.

వెం॥ రె:- ఇంత బలవంతంగా, సంఘ వ్యతిరేకంగా యీ పెండ్లిచేయక పోతే మరెక్కడా పిల్లదొరకదా ?

సుబ్బా:- దొరక్కేమి. ఇల్లూవాకిలీ, పొలంబొట్రా కలవాడు, చదువు కున్నవాడు ఎవరైనా యిస్తారు. కాని మనవంటివారికి బుద్ధి రావటానికట యీ పెండ్లి. ఇంకా యేమి నెగ్గుతామయ్యా !

వెం॥ రె;- ఇంతవరకు వచ్చినప్పుడు మీరంతా యేకమై వారికైనా అపరాధం వేయరాదు ?

సుబ్బా;- ఏంవేస్తాం. మావాళ్లు మంచివారైతే యీ గతంతా యెందుకు పడుతుంది. నావంటి సంస్కారులు యే కొద్దిమందో వుంటారు. అందరూ వారి పంథాలోనివారే ? మీరు చదువుకున్నవారు, పలుకుబడికలవారు కాబట్టి వారిని పిలిపించి యిది తగదని చెప్ప గూడదు ?

వెం॥ రె:- చెప్పితే సాగేవ్యవహారమా యిది ? అయినా రేపుసాయంత్రం నాలుగు గంటలకు రండి మాట్లాడుదాము.

సుబ్బా:- మంచిది అలాగే. ( వెళ్లుచు తనలో ) కాంగ్రెసువాదులం, సంస్కారులం అనుకొని విఱ్ఱవీగుతున్న ఈ రంగారావు మొదలైనవారి పొగరు యీ దెబ్బతోగాని అణగదు.

(నిష్క్రమింతురు.)

(తెరవాలును)

## 2 వ రంగము

కాఫీహోటలుముందు భాగము. రెండువైపులా రెండుబల్లలువేసి వుండును. పందిరిమీదుగా మూడురంగుల అశోకచక్రముతో జండా యెగురుచుండును.

(రంగాశాపు, వెంకటదాసు మాట్లాడుతూ ప్రవేశము)

వెంకటదాసు వయసు 18. ఖద్దరులాల్చీ, ధోవతి ఉత్తరీయము, గాంధిటోపి, ప్రశాంతవర్చస్సు, నిరాడంబరజీవి, కాంగ్రెసు వర్కరు.

రంగా:- అవును మాలవై ఉన్న నీతో కలసి తిరుగుటకూడా ఒకతప్పుగానే లెక్కగట్టేనారు.

వెం-దా:- పోనివ్వండి! మీరుమాత్రం అంటరానివారమనే మా కొఱకు సంఘానికెందుకు దూరంకావాలి.

రంగా:- వెంకటదాసూ! సంఘంమెడకుకట్టుకొని న్యాయంనికి దూరస్థులం కావటం పాపంకాదా? మీరు యెంతచదివినా, ఎంతటి ప్రపంచ జ్ఞానం సంపాదించినా యెల్లకాలం మంతో యిట్లా నీచంగా చూడబడవలసిందేనా ?

వెం॥ దా;- అవునండీ! శాస్త్రాచారంగానడుస్తున్నామంటారే "సర్వేజనా స్సుఖనో భవంతు" అని నిత్యంచదివే న్యాయాన్ని మరుస్తారేం.

రంగా:- ఈ యంటుదోషమనేది అనేకకాలాలనుంచి మానవులయందు జీర్ణించిన అంటువ్యాధి ఇప్పటికిచూడు వెంకటదాసు! ఇది యెంత వింతో "జాత్యైక్యత కావాలి" అయితేనేకాని దేశం బాగు పడదు. అని నెహ్రూమహాశయుడు కొట్టుకుంటున్నాడు. ఇంకా కొందరు మహాత్ములు వుపన్యాసరంగాలమీదికెక్కి బ్రహ్మాండ మంత ఐక్యధోరణులను వెళ్లబోస్తున్నారు. కాని జాతికి జాతికి మధ్య ఆకాశమెత్తు అడ్డగోడలను కట్టుకుంటున్నారు. ఈ మాన వత్వమంతా మారి, న్యాయసమ్మతమై ఇంకా యెగువమెట్టుకో, కాక పూర్తిగా దిగువమెట్టుకో వస్తేతప్ప యీ ఐక్యతకుదురదు.

వెం॥ దా:- అవును. గాంధిమహాత్ముని ప్రేమహృదయఫలంగా కొందరు విజ్ఞానులు ముందుకు వచ్చినారనుకోండి. అయినా యేమిసుఖం

మావంటి దీనమానవుల గతి యథాప్రకారంగానే మ్రగ్గవలసి వస్తున్నది.

రంగా: వెంకటధాసూ! సత్యం చెబుతా? చూడు. ఏదో పెద్దగా దేశసేవజేయలేకపోయినా సంస్కారానికి కొంచెం దగ్గరలో నడు స్తామంటే చూడు ప్రస్తుతం నా స్థితి, ఇంటాబైటా అంతటా నిర్బంధంగానే వున్నది.

వెం॥ దా: ఏమిటంటావు ?

రంగా: ఏమీలేదు. చెప్పేదానికంటే ఆచరణ గొప్పదికదా అని ప్రస్తుతం రెండు పనులకు ప్ర॰నుకున్నాను. వాటికి యింటిలో మా నాన్నగారి తగాయిదా, వెలుపల నేనేదో సంఘవ్యతిరేక కార్యాలు చేస్తున్నానని అల్లరి.

వెం॥ దా: నీ విప్పుడు చేయవలచిన పనులేమిటి ?

రంగా: ముందు మీ పల్లెలో బడిపెట్టి మీ సంఘాన్నంతటిని మంచి దోవకు తీసుకురావాలి. తర్వాత వొక వితంతుకన్యను వివాహం చేసుకోవాలి.

వెం॥ దా: ఆఁ ఎవరామె.

రంగా:— అదే గంగాధరశాస్త్రిగారి సుందరం లేదు. ఆవిడ.

వెం॥ దా: ఏమీ! ఆమెను వివాహం చేసుకోవలసిన అగత్యం.

రంగా: మే మిద్దరం ఒక స్కూలులోనే చదువుకున్నాం. అప్పట్లో మ॰కిద్దరికి పరస్పర ప్రేమ లంకురించినయి.

వెం॥ దా:— ఆయితే మొదట్నే విచారించి యెందుకు చేసుకొనకపోయి నావు ?

రంగా: విచారించినాము. కాని నేను ప్రస్తుతకాలానుగుణ్యంగా మడీ మైలా పాటించకుండా తిరుగుతున్నానని వారికి తగినవారిని చూచుకొ॰న్నారు.

వెం॥ దా:— వా రింతగా జేస్తే అదీ అంతగానే అయిందే ?

రంగా: కాని యిప్పుడా పిల్ల నాయందలి పూర్వపు ప్రేమను మరువ కుండా, నన్ను నీ దాన్నిగా చేసుకొను మంటున్నది.

వెం॥ దా:— అయితే యిది ముఖ్యంగా జరగటం చాలా న్యాయం.

రంగా: కాని ఇప్పుడది సంఘమర్యాదకు భంగమని యివ్వాళ సాయంకాలం గ్రామపెద్దయైన వెంకటరెడ్డిగారింటికి పిలిపించి యీ వివాహం చేయవద్దని చెప్పిస్తారట.

వెం॥ దా:— ఈ యాలోచన వారిదాకా యెట్లా పోయింది.

రంగా: మాలోనే వున్నాడు మహానుభావుడు సుబ్బావధాన్లని చదువూ సంధ్యా యేమీ లేని శుద్ధశుంఠ. పొట్టకూటికి యెక్కడే తద్దినం దొరుకుతుందా అని యెదురుచూస్తుండేవాడు. తానొక శాస్త్రవేత్తనని విఱ్ఱవీగుతూ యీ వివాహంతో ప్రపంచమంతా మునిగిపోతుందని గోలెత్తి తనతోపాటు మరికొంత గుంపును పోగుజేసి రెడ్డిగారిదగ్గర తగాదా బెట్టినాడు.

వెం॥ దా:— రెడ్డిగారికైనా యిది తనకు సంబంధించిన విషయంకాదని తెలియదా ?

రంగా: వారున్ను యీ మూఢాచారపు పట్టుదలల్లో వీరికంటే యేడాకు లెక్కువ చదివినవారే ?

వెం॥ దా:— సంఘం యింత పట్టుబట్టినప్పుడు మీ రేమిచేయదలచినారు ?

రంగా: మా నాన్నగారీవరకు స్వల్పవిషయాలమీదనే నన్ను మందలిస్తున్నారు. యీ విషయంపంటే మరీ మండిపడతారు. కాని వీరికొఱకు న్యాయాన్నతిక్రమించవచ్చు నంటావా ? కాబట్టి ముందు మీ పల్లెలో ప్రవేశిస్తే తరువాత మిగిలిన ఘట్టాలన్నీ చూచుకోవచ్చు. తలపెట్టిన పనులుమాత్రమేమీ ఆగవు. దేవుడు మేలుజేస్తే యివ్వాళ వెంకటరెడ్డిగారి సభకువెళ్లి వారిముందు కొంత న్యాయతత్వాన్ని వెల్లడించి మరీవెళ్లాలి.

వెం॥ దా:— మంచిది న్యాయంవైపునకు భగవంతుడు మొగ్గివుంటాడు. మరల రే పెక్కడ కలుసుకోవటం.

రంగా: గవర్నమెంటు లైబ్రరీదగ్గర.

వెం॥ దా:– సరేవస్తా ?

( ఇద్దరు చెరివోకవైపున నిష్క్రమింతురు. )

♦

## 3 వ రంగము

వెంకటరెడ్డిగారి యింటిముంగిలి వసారా. అంతటా చిరుచాపలు పరిచి, అందరు కూర్చుండి యుందురు.

వెంకటరెడ్డి, సుబ్బావధాన్లు అధికారి కీవిలో కూర్చుండి యుందురు. రామశాస్త్రి, యేమియు తోచనిస్థితిలో తలవంచుకొని కూర్చుండును. రంగారావు, ప్రశ్నల కెదురుచూచుచు ధీరత్వముగా నుండును.

గోపాలరావు, వయసు 22. ఖద్దరు పట్టంచు ధోవతి, లాల్చీ. ఉత్తరీయం. గాంధీటోపీ, కొంచెము క్రోధస్వత్వం, కాంగ్రెసు వర్కరు.

మధుసూదనరావు, వయసు 20 ఖద్దరు ముప్పాళ్లధోవతి, లాల్చి, ఉత్తరీయం, గాంధీటోపీ, సామాన్యతత్వం, కాంగ్రెసు వర్కరు.

వెం॥ రె:_ ఏమండీ! రామశాస్త్రిగారూ! మిమ్ములను యిక్కడికి పిలిపించటం ఎందుకో తెలుసునా ?

రామ: తెలియదుబాబూ.

వెం॥ రె:_ మీ కొమారుడికి, గంగాధరశాస్త్రిగారి వితంతుకొమార్తెను బలవంతంగా తెచ్చి వివాహం చెయ్యాలంటున్నారట నిజమేనా?

రామ: (ఆశ్చర్యముతో) ఇదికూడానా ? నాకు యే పాపం తెలియదండీ! నేనూ యింత అధ్యయనపరుణ్ణిగాని శుద్ధశుంఠను గాను. ఇటువంటి శాస్త్రవిరుద్ధపు పనుల్లో ప్రవేశిస్తానా ? కుర్రవాడు నా మాటపట్లల్లో వుండేటట్టు కనబడటం లేదు. దానికి నేనేం జేస్తాను.

సుబ్బా: (రెండుచేతులూ ప్రక్కకు విసురుతూ) ఈ పైపై సమాధానాలతో లాభంలేదు. ముందు చాలా యిబ్బందులు పడవలసి

వస్తుంది. పెద్దవాడివి నీవు చక్కగాబోధిస్తే పిల్లవాడిట్లాయెందుకు చెడిపోతాడు.

గోపా: (కోపంతో) ఏమిటి యిందులో చెడ్డది. ఇదేం తప్పాడు సాక్ష్యాలు కూయటంగాదు, లోకులకొంపలు దోయటంకాదు.

సుబ్బా: ఆధీనంతప్పిన పిల్లను మాయజేసి యిట్లా గొంతుకోయట మేనా ?

మధు: గొంతుకోయటంకాదు శాశ్వతమంగళసూత్రం కట్టటం.

వెం॥ రా:- అదేం మాట. తల్లిదండ్రుల యిష్ట మక్కరలేదా ?

గోపా: పిల్లకిష్టమైతే ?

సుబ్బా: పిల్లకు చిన్నతనం గనుక తెలిసీ తెలియని యీ యీడులో వొప్పుకుంటేమాత్రం తర్వాత నలుగురిలో తలవంపులై యెంత దుఃఖిస్తుందో మీ కేమైనా తెలుసునా ?

రంగా: (నవ్వుచు) ఓహో! బాగాజెప్పారండీ! అవధాన్లుగారూ! పడకటింటిలో మీరుచేరి పంచగదిలో మీ వింతంతుకోమార్తె ఎంత సంతోషిస్తూ పడుకుంటుందో మీకుమాత్రం తెలియదు?

వెం॥ రా:- (కోపంతో) గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిందన్నట్లు నేటికి మీ రంతా కాంగ్రెసువాదులమని బయలుదేరి పూర్వాచారాలన్నీ బండబూతుల్లోకిదించి, శాస్త్రాలన్నీ గంగలోతోస్తున్నారు.

సుబ్బా: తోస్తున్నారేమిటి ? తోసివేశారు. లేకుంటే యీ మాల కూడు దినేమాట లెందకొస్తై.

సీ. మాలచదువులువచ్చి మహిమాన్వితములైన
శాస్త్రమార్గంబుల చదునుజేసె
మారుమనువులువచ్చి మర్యాదగా సాగు
గృహధర్మములనెల్ల కూలద్రోసె
ఆడచదువులువచ్చి అసలుకు మోసమై
వంటింటిపనులలో బారవేసె

కులసమైక్యతవచ్చి పలునాళ్లుగావచ్చు
నిష్ఫలనన్నింటి రుజేసె

గీ. కొనకు కులమేది, గుణమేది, గోత్రమేది
నీతి నియమాలకెల్లను నీళ్లువదలి
దేవుడా! యని మిన్నుల దిట్టుకొనుచు
గడుపవలసి వచ్చెను నేడు కాపురాలు.

రంగా: అవధాన్లుగారు! వా రనగానే అంత తేలిక యెందుకండీ!

సీ. మాల మాల యటంచు తూలనాడెద రేల?
తోయజాక్షుని మెడ తులశిమాల
మాల మాల యటంచు మేలమాడెద రేల?
అంబుజోదరు చేత నక్షమాల
మాల మాల యటంచు గోలజేసెద రేల?
భోగిభూషణు మెడ పునుకమాల
మాల మాల యటంచు మాటలాడెద రేల?
జటిపుంగవుని చేత జపముమాల

గీ. మాలలోనున్న మర్మంబు మరచిపోయి
జీవసోదరభావంబు చెరచి యకట?
సాటిమానవు నీరీతి చాకజేసి
మాల మాల యనుచు బుద్ధిమాలనేల?

సీ. పుట్టినమాత్రాన బూదిపాలాయెనా?
మానవధర్మైక మహితబుద్ధి
ఆచారగతిచేత నడుగంటిపోయెనా?
సమహిత తత్వప్రశస్తగుణము
వృత్తికారణమున రిత్తయైపోయెనా?
జీవనగౌరవాస్తిక్యనియతి
అజ్ఞానతిమిరంబునం దంతరించెనా?
పరహితచింత నాచరణనిరతి

గి. ఏమికారణమున వారి నీ విధాన
దీనులనుజేసి నిచ్చలు తీరరాని
కష్టనిచయంబులకు లోనుగా నొనర్ప
పాల్పడిరి నిర్దయుతను సవర్ణజాతి.

చదివి జ్ఞానవంతుడు కావటానికూడా మాల బ్రాహ్మణ భేద మున్నదా ?

సుబ్బా: ఎందుకులేదు. మాలచదువు బ్రాహ్మణచదువు ఒకటౌతుందా?

రంగా: దేహాల్లో భేదముంటుందిగాని, బ్రాహ్మణజ్ఞానమనీ, మాల జ్ఞానమనీ జ్ఞానం రెండుగా వుండదు. జ్ఞానం ఈశ్వరదత్తం. దాని కందరూ సమానులే.

సుబ్బా: అబ్బాయీ! వా రెంత చదివినా, యెంత శుచిగావున్నా పల్లెదాటి యేనాడూ గ్రామంలో అడుగుబెట్టి యెరుగరు వారి పుట్టుకలే అటువంటివి.

గోపా: అవధాన్లుగారు! కొంచెం ఆలోచించి మాట్లాడండి!

గీ. పుట్టువొందిన ప్రతిజీవి మట్టియందు
చేరుటను జూచుచున్నా మనారతంబు
దేవమాత్రమణంగదు చిత్రమేమొ
మూడుదినముల బ్రతుకుకే మురిపమింత.

సీ. రంగనాయకుపాద రాజీవబృందమా
పరమభక్తుడు తిరుప్పాణి యెవడు ?
పండరీపురనాథ భక్తాగ్రగణ్యుడౌ
భూరిపుణ్యుడు నందనా రెవండు ?
సంతత లింగదీక్షాధురంధరుడగు
కారుణ్యమూర్తి కక్కయ్య యెవడు ?
శివపూజనాసక్త చిత్తసర్వస్వుడౌ
భాసురమతి రోహిదా సెవండు ?

గీ. ఢిల్లినుండి చెల్వప్పిళ్ల నుల్లమలర
మగుడ గొనివచ్చునపుడు రామానుజునకు
నన్నివిధముల సాహాయ్యమైన దెవరు ?
మనుజులై జన్మమొందిన మాలవారె.

వెం॥ రె:— గోపాలరావుగారు! నైష్ఠిక బ్రాహ్మణ కుటుంబంలో బుట్టిన మీవంటివారే ఇట్లా మాలల్లో కలిసి పోతుంటే ఇక మాట్లా డేముంది ?

రంగా: మీరు శాస్త్రాలంటున్నారుగా? ఆ యనుభవంతోనైనా మాట్లాడండి ?

సీ॥ కుక్కను, మాలను, గోవును సమముగా
కనుమన్న శ్రీకృష్ణు కథను మరచి
అఖిలభూతదయా సమన్వితులగు మన్న
బుద్ధదేవుని దివ్యబోధమరచి
మాలవారికే తిరుమంత్రమొసంగిన
రామానుజాచార్య ప్రేమమరచి
ఈశ్వరదృష్టియం దెల్ల రొక్కటేయన్న
గాంధిమహాత్ముని గాథమరచి

గీ॥ పంచములటన్న నిటులేవగించుకొనుచు
కనుల గనరాదు, వీనుల వినగరాదు,
చదువ, వ్రాయను, నేర్వంగ జనదటంచు
క్రూరనియమంబు లొనరింప గూడునయ్యా !

గోపా: అయ్యా! ఏ శాస్త్రాలు చెప్పినా, పురాణాలుచెప్పినా మానవులై పుట్టినందుకు ఇది పుణ్యం, ఇది పాపం అని గ్రహించి హృదయాన్ని పవిత్రంగానుంచుకొని జీవకోటి సంతతిని తనవలెనే చూచుచూ జీవయాత్ర గడపవలెనంటున్నవి. కనుక వారి చదువులు మీకెప్పుడూ భంగకరంకావు. చదువుకొని దైవ

దృష్టితో వారి దేహాలను, గేహాలను, సంఘాన్ని బాగుచేసుకో నివ్వండి. దానిలో దోషమేమున్నది ?

మధు: శాస్త్రాలట్లావుంచి కేవలం పారమార్థికదృష్టితో చూచినా, నిమ్నస్థితియందున్న వారికి విద్యాబుద్ధులునేర్పి సన్మార్గ వంతుల్నిగా చేయటం మనవిధి.

రామ; చేస్తారు. ఎందుకు చేయరు. ఇక దేవునితో పనిలేదు. సృష్టి యావత్తూ మీ చేతుల్లోనేవుంది.

వెం॥ రె:— మీవంటివారి మాటలబలంతోనే ఎక్కడనో కాలిక్రిందఅణిగి ఉండవలసిన యీహరిజనులంతా "నీవెక్కువేమిటయ్యా" అనే స్థితిలోకి వచ్చినారు.

మధు; ఏం వస్తే వారూ మనుష్యులే ?

సుబ్బా; ఆఁ అంతలోకి వచ్చింది ప్రపంచం.

రంగా; మనుష్యులమనుకోవటంకూడా తప్పేనా ?

వెం॥రె; అలాఅనుకుంటే సరిపోయిందా ? పిన్నా పెద్దా, మంచీ చెడ్డా యేమీలేదా ?

మధు; "మేము పశువులంగాము మనుష్యులమే" అని చూచిన మాత్రంతో మీ పెద్దతనానికేం భంగం వచ్చింది.

వెం॥రె; ఇంకేం పెద్దతనం. వారిక మాటవినటం వుటుందా? నెత్తికెక్కి "మీరే మా సేవజెయ్యాలి" అంటారు. కుక్కకుముద్దిస్తే మూతి నాకిందిట.

రంగా; ధనికుడవుగా వుండుటచేత ఒకనితో సేవ జేయించుకొని; అందువలన నీవు తక్కువపడినావనటం ఎంత అన్యాయమో విచారించండి ?

సీ॥ దొడ్డిశుద్ధినిజేయు దోషంబునను కొంద
రంటరానివారలైరి మరియు

గ్రామశుద్ధినిజేయు కారణంబున కొంద
రటు చెప్పరాని వారైరి మిగుల
తలలను గుడ్డలతగ శుభ్రపరుచుట
కులముతక్కవవారు కొందరైరి
చిర్లరపనులన్ని చేసి సాయమొనర్చి
తక్కువైరి కొందరక్కట కట!
గీ॥ అవసరానికి వారితోనన్ని పనుల
గడపుకొని హీనులుగజూడ ఘనతగలద?
అన్ని పనులను మీరలేలందుకొన్న
అపుడు మీదేమికులమానొ యరయరయ్య!

సుబ్బా;— అన్ని బుద్ధులు మీరే చెపుతుంటిరి. వారిక మావంటింటిలో దూరకుండా యెందుకు బతకనిస్తారు?

వెం॥ రె;— దీనితో యేమయింది? రేపిక మాలపిల్లను దెచ్చి పెండ్లి చేసుకో మనికూడా చెపుతారు.

మధు;— జరిగేవి అవికూడా జరుగుతూనేవున్నయి. ఎన్ని జెప్పినా కరగని మీవంటి రాతిగుండెలుమాత్రం ఆకల్పాంతం అలాగే వుంటై.

వెం॥ రె:— మీరు క్రమంగా మర్యాదలన్నీ తప్పి తప్పుమార్గంలో పడు తున్నారు. ఈ సమాధానాలతో పనిలేదు. (రామశాస్త్రిగారి వైపునకు తిరిగి) రామశాస్త్రిగారు! జరిగినమీదట అనుకుంటే లాభంలేదు. ఈ వివాహం యిలాగే మూర్ఖించి చేశావంటే ముందుచాలా యిబ్బంది పడవలసివస్తుంది. యేమంటావు?

రంగా:— అవన్నీ యెరిగి నిశ్చయం చేసుకొనే ఈ వ్యవహారంలో ప్రవేశించినాము.

సుబ్బా: అబ్బాయీ! రంగారావు! నీ విప్పుడు కుఱ్ఱతనపుపొగరులో వున్నావు. ఈ సాధకబాధకాలు నీకింకా బాగా తెలియవు. పెద్ద వాడిని మీ నాన్నను మాట్లాడనియి.

గోపా: (లేచి నిల్చుని ధీమాగా) వధూవరుల కిద్దరికీ యిష్టమైంది. తర్వాత యేది యెలాజరిగినా సరే యీ వ్యవహారం పూర్తి కావలసిందే?

వెం॥ రె: అంతా నీ యిష్టమేనా ? చేయటానికి. చేయి యెలా చేస్తావో చూస్తాను. మామాటలే ననుకొన్నావేమో తోసి వేయటానికి. మీద ప్రభుత్వమున్నది.

మధు:— వధూవరులకిష్టమైనతర్వాత ప్రభుత్వానికేమీ సంబంధము లేదు.

సుబ్బా; ఇక గ్రామంలో మీకు పచ్చిమంచినీళ్లు బుట్టవు.

మధు; (అపహాస్యముగా) ఏడాదికి మూడు భ్రూణహత్యలు చేయిస్తున్నా, రహస్యం కాబట్టి వారింటినీళ్లు జాహ్నవీతోయాలు. పాపమెరుగని పసిబిడ్డలకు ప్రకాశంగా రెండోపెండ్లి జేసిన వారిల్లు త్రొక్కరానిది ?

రంగా; (లేచివెళ్లుచు) పోనివ్వండి. మాకు మేము బతుకవచ్చునుగా?

వెం॥ రె; సరే. ఇక మీ యిష్టం వెళ్లండి.

(తెర వాలును.)

శ్రీరస్తు

# న్యాయం

## మూడవ అంకము

### 1-వ రంగము

గంగాధరశాస్త్రిగారి యిల్లు. మధ్య వరండాలో పార్వతమ్మ చిన్నచాపమీదకూర్చుని దుఃఖించుచుండును.

కామమ్మ వయసు 30. తెల్లని మల్లుధోవతిగల వితంతువు.
సుబ్బమ్మ వయసు 30. తెల్లని మల్లుధోవతిగల వితంతువు.
శ్యామలమ్మ వయసు 28. చక్కని రంగుచీర. ముత్తైదువు.
పొరుగుయిండ్లవారు పార్వతమ్మను ఓదార్చుటకు వత్తురు.

పార్వ: కామమ్మతల్లీ! లోకులంతా కలిసి నా బిడ్డ నిలా జేస్తారని తెలియ లేదమ్మా!

కామ; పిన్నీ! మీయింట్లో పిల్లని తీసుకెళుతుంటే నీ కెలా తెలియ లేదమ్మా!

పార్వ; మావారు వొట్టి అమాయకులు. వాళ్ళంతా యింత కుట్ర జేసి ఆలోచనలు జరుపుతుంటే కొంప మునిగేదాకా నాకు తెలియనిచ్చారా?

సుబ్బ; పార్వతమ్మొదినా! లోలోపల యీ యాలోచన యెన్నాళ్ళ బట్టి చేస్తున్నారో?

పార్వ; మాకే తెలియదుగాని గ్రామమంతా తెలిసిందట. పాపమా సుబ్బావధాన్లుకూడా యిది తగదని బుద్ధిచెప్పినాడట.

శ్యామ: అత్తా! బుద్ధిలేనివారి కెన్నిబుద్ధులు చెపితేమాత్రం యేమి సుఖం? ఇంతకూ యెలా తీసుకెళ్ళినారమ్మా! పిల్లను.

పార్వ; శ్యామలమ్మా! ఎలా తీసుకెళ్ళటానికి వారికేం భయం? చక్కగా బండి చేసుకొని వచ్చినారు మధుసూదనరావున్ను, గోపాలరావున్ను. అదేం మంత్రమో తల్లీ! వాకిట్లోకి వచ్చి రవ్వంత సంజ్ఞజేశారు. ఛటాలునవెళ్ళింది బండిలోయెక్కింది పిల్ల.

కామ; అనగూడదుగాని పిన్నీ! మనలోమాట. ఈ జరగటమంతా మనమ్మాయికూడా యిష్టమేనేమో?

సుబ్బ; లేకుంటే అంత త్వరగావెళ్ళి బండెందుకెక్కుతుంది?

పార్వ; సుబ్బమ్మా! ఆ దుర్మార్గులు మందేదో పెట్టినారు.

కామ; మందెందుకమ్మా! వయసొచ్చిన బిడ్డ. ఏదో ఆధారం యేర్పరచుకుంటే సుఖపడవచ్చుననుకొని వుంటుంది.

పార్వ; దీని సుఖం మండిపోను. ఇక నేనుగాని, అదిగాని నలుగురిలో తలెత్తుకొని తిరగ్గలమా?

సుబ్బ; పోనీలే వదినా! నాలుక్కాయలు గాస్తే నలుగురిలోకి అదీ వస్తుంది.

కామ; (ఎగతాళిగా మూతితిప్పుతూ) అప్పటి కామెకూడా అందరికీ తప్పలుదిద్దేది కాదూ?

పార్వ; అయ్యో! వంశమర్యాదలన్నీ వల్లకాడుజేసి యిలా వుండటం మంచిదటమ్మా!

కామ; (చేతులుచాచి తిప్పుతూ) ఇట్లావుండినమాత్రం యేం వెలిగిస్తున్నారు? మనమే చూస్తున్నాంగా వైద్యాలనీ, వల్లకాడనీ తిరగటం. దానికంటే యిది నయంకాదూ?

పార్వ; ఏమినయమో, వెధవ నయం. చేతికీ కాలికీ అక్కరకొచ్చిందనుకున్నానుగాని ఇలా కంటిలో కంపగొట్టి పోతుందనుకోలేదు కామమ్మతల్లీ! (పైటచెరుగుతో కళ్ళుతుడుచుకుంటూ ఏడ్చును.)

శ్యామ; అత్తా! ఇంతకూ వివాహం ముగిసినట్లేనా?

పార్వ; ఏమో? ఏవిషయం సున్నపాకు తోడిమంతకూడా తెలియ నీయటంలేదు మావారు. మంచంబట్టి యేడుస్తున్నా.

సుబ్బ; గ్రామంలో పెద్దలునలుగురూచేరి యిదిబుద్ధిగాదని చెప్పినారట. వినలేదు. అప్పుడు చాకళ్లను, మంగళ్లను అందరినీ పిలిచి, వారికీ, వారికితోడైనవారికీ యెవ్వరూ యేపనులూ చేయగూడ దనీ, బావుల్లో నీళ్లకు రానీగూడదనికూడా చెప్పినారట.

శ్యామ; ఈ యాంక్షతో వారికేంభయం, పంచములతోసహా అంద రితో కలసి తిరిగేవారికి.

పార్వ;— అయ్యో తల్లీ! మా అమ్మాయిని మాలకూటిలోకు డం పడవేస్తారా?

శామ; (నవ్వుతూ) ఇది ఇవ్వాళవింటున్నావా? ఇప్పటికే కొన్నాళ్ల క్రితమే వెంకటదాసనే చెప్పరానివాడితో కలసి పల్లెలో బడిబెట్టి పిల్లలకు చదువుచెపుతున్నాట్ట మీకొత్తల్లుడు.

పార్వ; మాబ్రాతకుతగినట్లే దొరికినాడు వాడెవడమ్మా!

సుబ్బ; మొన్నటివరకూ గోపిరెడ్డిగారింట్లో జీతానికున్న శేషాదాసు చిన్నకొడుకట వెంకటదాసు. వాడికి విశాఖపట్నంలో బి. ఏ. వరకు తండ్రి కూలిడబ్బుతో చదువు చెప్పించినాడు. వాడే మీముద్దులల్లుడికి ముఖ్యస్నేహితుడు.

శామ;— బ్రాహ్మణ్యమంతా యిలామట్టికొట్టుకొని పొయ్యేరోజులువచ్చి కూర్చున్నయి.

శ్యామ; వద్దంటే వినకుండా చెప్పిస్తున్న యీ మాలచదువులు, ఆడ పిల్లల చదువులే అన్నికొంపలూ ముంచుతున్నయి.

పార్వ; శ్యామలమ్మతల్లీ! నేను నోచిన నోములు యిట్లాంటివి. తల్లనీ, బిడ్డనీ పిలుచుకోకుండా యెడలుబాపినారు పాపాత్ములంతా కలిసి. పిల్లకయేమైనదో యెక్కడున్నదో కుడా తెలియదుదా?

శామ; మీవారి నడక్కపోయినంప?

పార్వ;— ఆ మాత్రం స్వతంత్రంవుంటే యీ గతెందుకుపడుతుంది?

సుబ్బ;— ప్రస్తుతం గోపాలరావుగారి యింటిదగ్గర వుంచినారట. ఈ సంఘానికంతా నాయకుడు మీఅల్లుడే. పల్లెంతా పవిత్రంజేసి హరిజన బంధువులతో కలసి అప్పుడు చేసుకుంటార్ట యీ న్యాయ వివాహం.

పార్వ; అమ్మో! భగవంతుడా! మా నిష్టలన్నీ నీళ్లపాలై పోయి నయ్యమ్మా! యీ బిడ్డతో.

కామ;— వెటకారంగా పిన్నీ! మీ వారు మంచివారైతే ఆ దుర్మార్గుల్ని యేమైనా చేసి మనపిల్లను మనం దక్కించుకోవచ్చు. వీళ్లే వారివారై పోతే కావేంజేస్తావు. చూస్తూవూరుకో.

పార్వ;— బిడ్డకేకాకుండా యిహానికీ పరానికీ కూడా దూరం కావలసి వచ్చింది గదా!

శ్యామ;— (ఒకవిధమైన ఎగతాళిగా) ఏమీ తొందరలేదు అత్తా! నాలుగేళ్ళు గడిచినయ్యంటే అన్నివ్యవహారాల్లో పెత్తనాలు వీరివ్యే. అంతరాలవారికే అందలాలూ, ఆదరణలూను.

కామ;— కపటపు ఆదరణతో) అయిందేదో అయింది. ఇప్పుడేమను కొన్నా లాభంలేదు గనుక మీ వారితో చెప్పి వారితో కలిసి మెలిసి వుండటం మంచిదనుకుంటాను.

పార్వ; ఏమిటమ్మా! అట్లా అంటారు. అంత కులహీనులతో యెట్లా గమ్మా కలిసి తిరగటం.

కామ; ఏమో మీయిష్టం. యెప్పుడూ వున్నదేగదా అని యింటి దగ్గర భజనకూడా మానుకొని చూచిపోదామని వచ్చాం. వెళ్లి వస్తాం పిన్నీ!

పార్వ; వెళ్ళండమ్మా! నేటి కిట్లావచ్చినై మారోజులు.

( తెర వాలును )

## 2 వ రంగము

మాలపల్లెలో బడి. పూరిచ పడిలో చినిగినచిన్నచాపలు వుండును.

రంగారావు ప్రవేశము.

వెంకడు వయసు 9. కురచలాగు. చినిగిన చొక్కా.

కోటప్ప వయసు 10. చేతులులేని చొక్కా. చినిగిన లాగు.

రంగా: అరే వెంకా ! మిగిలిన పిల్లలేరిరా ?

వెంక: నాగడు గొడ్లగాయటానికి వెళ్లాడండీ ! వీరడింకా నిదురబోతున్నాడు. సంగదాసు, ఓగులాయ గడ్డికి బొయ్యారు.

రంగా: నీ వొంటిమీద ఆ పులిచారలేమిట్రా ! నీళ్లు బోసుకోలేదా ?

వెంక: నేను పోసుకుంటానంటే మనకి అలవాటులేందే పొద్దున్నే నీళ్లేమిటి వద్దంది మాయమ్మ.

రంగా: నీళ్లుబోసుకుని శుభ్రంగా వుండాలి అని నేను చెప్పలేదురా ?

వెంక: ఆసంగతి నేనుకూడా మా అమ్మకీ, మా అయ్యకీ చెప్పానండీ అట్టయితే బడీవొద్దు యేమీవొద్దులే అన్నారండీ !

రంగా: మొకంగూడా కడుక్కోలేదా ?

వెంక: లేదండీ ! నిదురలేవంగానే పుల్లనీళ్లుబోసి బడికిపంపింది మాయమ్మ !

రంగా: కోటప్పా ! నీకు దిద్దబెట్టిన అ. ఆ. లు యింకా రాలేదుగా ?

కోట: ఇంకా దిద్దటమే లేదండీ ! మా వాళ్లు గడ్డికోసుకురమ్మంటారు. చదువుకోవాలని చెపితే, నీవేం కలకటేరు జేత్తావా? "పోలంబో" అంటారండీ !

( వెంకటదాసు ప్రవేశము )

వెం॥ దా:— పంతులుగారు ! నమస్కారం.

రంగా: ఈ నమస్కారాలకేంగాని, వీళ్లకింకా యెప్పటికోయీ తెలివి వచ్చేది. పదిమంది పిల్లలకు ఈ రోడు నక్షత్రాలు కనబడుతున్నై. వెంకడు చెప్పేదొక్కొక్కసంగతి విచారిస్తే వీళ్లను మనం యెంత వరకు సంస్కరించగలమా అని సందేహమేస్తున్నది.

వెం॥ దా:— ఇదంతా వాళ్లకు క్రొత్తగనుక మొదట్లో వింతగా వుంది. వాళ్లూ కొన్నిరోజులు లవాటు డితేగాని అన్నివిషయాలు చక్కబడవు. మీ స్వార్థత్యాగమహిమబలాన్ని ఊతగాచేసు కొని నేనున్నూ మా మాలలకందరికి శక్తికొలది బోధిస్తున్నాను. ఎన్నోవందల యేండ్లతరబడిగా పాతుకొనివున్న అనాచారాలను, అలవాట్లను క్రమమార్గంలో పెట్టటానికి యింకా కొంతకాలం పడుతుంది. అంతవరకు మనంకూడా ఓపికతో పనిచేయాలి.

రంగా;— ఇండ్లను పరిశుద్ధంగా వుంచుకోవాలి అన్న విషయం బాగా నచ్చచెపుతున్నావు కదూ ?

వెం॥దా:— రాత్రింబగళ్ళు నేను మీ సేవలోనేవుండి మీరు చెప్పిన ప్రకారం తుచ తప్పకుండా నెరవేరుస్తున్నాను.

రంగా:— వెంకటదాసూ! నీవు నాకు సహాయ్యంగావుంటే చాలు ఎంత లేసి వ్యవహారాలైనా నిర్వహిస్తాను.

వెం॥దా: — పంతులుగారు! మీ సౌజన్యహృదయమే కార్యసాఫల్యానికి మూలకారణంగా వుంటుంది. మా జాతి యెంతోపుణ్యంచేసి వుండబట్టే నేటికి సంఘానికి దూరస్తులైనా భయపడక వజ్రసంకల్పంతో మా పల్లెలోనే నివాస మేర్పరచుకొని యేవగించుకొనకుండా మా కష్టాలనన్నింటినీ చూస్తూ ఉద్ధరించటానికి కంకణం గట్టుకొని కూర్చున్నారు.

రంగా:— సంఘంకోసం నాకెప్పుడూ విచారంలేదు. ఎగువజాతులవారితో పశుప్రాయులుగా చూడబడుచున్న యీ హరిజనులకు నా జీవితంలో యేకొంచెం వుపకారం చేయగలిగినా నాజన్మ తరించిందని తలుస్తా.

వెం॥దా:, నేను వచ్చిన విషయం మరిచాను. వెంకటరెడ్డిగారు రేపటి నుంచి కూలికి రమ్మని పిలిచారు. నిరుడు రోజుకు నాలుగణాలు యిచ్చారు. ఈ యేడు రెండణాలకంటే యివ్వమని పట్టుబట్టి

నారు. ఆమీంద కూలీలు నన్ను సలహాఅడిగితే మీతో మాట్లాడి చెపుతానని వచ్చాను.

రంగా:— కూలీ లెంతమంది వుంటారు?

వెం॥దా: మా గూడెంలోవారంతా స్త్రీ పురుషులు యాభై మంది.

రంగా: రెండణాలకూలి పిల్లలతో వీరికి సరిపోతుందా?

వెం॥దా: చాలదు. మనసులో ఎవరికీ యిష్టంలేదు. కాని ధైర్యంగా నిలబడి అడగటానికి కొందరికి నోరులేదు.

రంగా: అందరూ ఒకమాటమీద నిలబడగ రా?

వెం॥దా: మీ మీద వారికి అమోఘమైన నమ్మకం వున్నది. మీ ఆజ్ఞ అయితే చాలు నిప్పుల్లో దూకమన్నా దూకుతారు.

రంగా: గొప్ప అగ్నిపరీక్షగానే వచ్చింది. అయితే ముందు సామోపాయంతోనే పని నెరవేర్చుకోవటం ఉత్తమలక్షణం. కాబట్టి నీవు వెళ్ళి వెంకటరెడ్డిగారికి నచ్చజెప్పి నాలుగణాలైనా యివ్వంది బ్రతుకలేరని చెప్పు. పర్యవసానం తేలేవరకూ కోతకు వెళ్లవద్దని కూలీల నాపు.

వెం॥దా: దాని కాయన యిష్టపడకపోతే?

రంగా: చిరరిసాధనం మహాస్త్రప్రయోగమే!

వెం॥దా: అంటే?

రంగా: సమ్మెచేయుటమే! దాన్ని జయప్రదంగా నిర్వహించే భారం మనమీద వుంటుంది.

వెం॥దా: మీరు "అహమస్మి" యని చక్రం త్రిప్పుతున్నంతవరకు అపజయమనేమాటే వుండదు. నమస్కారం. కూలీలకు చెప్పి వస్తా.

రంగా: శుభం. పోయిరా.

( తెర పడును )

## 3 వ రంగము

గంగాధరశాస్త్రిగారి యిల్లు. మధ్యవరండాలో మంచంమీద జ్వరముతో మూలుగుతూ పార్వతమ్మ.

ప్రక్కన కుర్చీలో విచారంగా గంగాధరశాస్త్రి.

పార్వ: (దిగులుతో దుఃఖము నటిస్తూ వుంటుంది) అయ్యో ! తల్లీ ! నిన్నెట్లా మరచేదమ్మా ! ప్రతిపనిలో యెంత చేదోడుగావుండే దానివే తల్లీ ! అయ్యో ! ఇక భరించలేను. ఒక్కసారి నిన్నీకళ్లతో చూట్టానికూ్కడా గతిలేకపోయెగదే అమ్మా !

గంగా: ఇదుగో ? నీ విలా బెంగబెట్టుకొని రాత్రింబగళ్లూ దుఃఖపడు తుంటే శరీరం కుదుటపడేదెట్లా ?

పార్వ: నా ఒక్కబిడ్డా దూరమైనతర్వాత యీ పాడుశరీరం యేమైతే నేమి ?

గంగా: (విసుగుతో) ఎంతజెప్పినా ఏడుపు మానవు. ఇన్నినీళ్లుగూడా ముట్టకుండా ఇలా అయిపోతుంటివి. ఇక గతేమిటి?

పార్వ: నా బిడ్డ యిల్లువదిలింది. ఆ రోజుమొదలుకొని నిత్యం వచ్చి పొయ్యేవాళ్లుకూడా మానేశారు రావటం. మేం జేసిన పాప మేమిటో ?

గంగా: పోనీ రాకపోతే. ఇంతటితో యేమీ మునిగిపోదులే ?

గీ॥ కులము పోనిమ్ము గోత్రమ్ము కూలనిమ్ము,
నాకు పనిలేదు వానితో నా సుపుత్రి
సౌఖ్యమొందుచు నుండులే చాలునాకు,
యెదిరి నోర్వనివానితో నేమిసుద్ది.

పార్వ:— బిడ్డకూ దూరమై, కులానికీ దూరమైతే మనకిక గతేమిటి ?

గోపా: దేవుడు.

పార్వ: అప్పుడప్పుడూ అంటుండేది. ఎక్కడెక్కడో వితంతుకన్యలకు వివాహాలు జరుగుతున్నై అని. నా మతి కాలిపోను ఇదికూడా ఆ యాలోచనలోనే వున్నదని తెలుసుకోలేక పోయ్యాను.

గంగా:— తెలిస్తే యేమి జేసేదానివి?

పార్వ:— ఇది చాలా అపకీర్తిపనని చెప్పి బ్రతిమాలుకొనేదాన్ని.

గంగా:— అపకీర్తిపని యింకొక విధంగా వుంటుంది యిదికాదు. చివరకు మంచిపనే చేసింది. మన అనంతరం దానికిమాత్రం దిక్కెవరు? చెప్పు. బాగున్ననాడు చుట్టుకుతిరిగే యీ చుట్టాలంతా ఆపదల్లో ఎక్కడకురారు. ప్రస్తుతపు మనస్థితి చూడరాదు?

పార్వ:— మీరే యిట్లా అనవచ్చునా?

గోపా:— అవును.

గీ॥ లోకులకు చెప్పువరకేమి లోటులేదు
చెప్పు నీతులలోకొన్ని చేయవలసి
వచ్చినప్పుడుగద కానవచ్చు నెవరి
కైన యందలి గుణదోష మూర్మ్యయందు.

పార్వ:— అయ్యో! అంతకంతకు బాధ యెక్కువౌతున్నది.

గంగా: డాక్టరింకా రాలేదా?

పార్వ: ఏమో! నా కా పాడుమందులు సహించవు.

గంగా:— అయితే బాధ తగ్గేదెట్లా?

పార్వ:— రామరామా! మడీలేదు మన్నూలేదు. వాళ్లను వీళ్లను తాకిన చేతుల్తోనే పోస్తాడు. ఆ పాడునీళ్లు నాకొద్దు.

గంగా;— మడేమిటి. ఆయన యెంతశుచిగావుంటాడో చూచావా?

పార్వ;— ఈపాడుమాటల్తోనే యిల్లంతా మాలకూడుచేస్తున్నారు. చస్తే పోనియి. నాకు మందువద్దు.

గంగా;— అయినా యీరోగం మందులతోకుదురదులే. నీది మనోవ్యాధి. దీన్నిమాన్పలేననే వుదయం వెంకటలక్ష్మితోచెప్పి "మీఅమ్మకష్టదశలోవుంది ఒకమాటువచ్చి చూచివెళ్ళ"మని కబురుచేశాను.

పార్వ;— ఎక్కడున్నది అమ్మాయి?

గంగా: గోపాలరావుగారింట్లో

పార్వ; వార్ని వెలివుంచారుగా ?

గంగా; ఏమయితే?

పార్వ; ఇదేంపాపమండీ! అక్కడజేరినకిల్లను ఇక్కడికెరప్పిస్తే ఇంకా యేమైనా గతున్నదా ?

గంగా; — నీవుమాట్లాడకు. అందరూ మనత్రోవలోకి వచ్చేటట్టుచేస్తానో లేదో చూస్తూవుండు. నీవుమాత్రం అల్లరిచేయకు.

పార్వ; ఏమో మీయిష్టం.

(రంగారావు, సుందరమ్మ ప్రవేశింతురు.)

పార్వ; అమ్మా! సుందరం! వచ్చావా? ఈకళ్లతోయింకా నిన్ను చూస్తాననుకోలేదు తల్లీ! రాఅమ్మా! రా!

సుంద; అమ్మా! ఏడవబోకు.

పార్వ; ఎట్లాభరించేది తల్లీ! ఏడ్చును

సుంద; అమ్మా!

గీ॥ కన్నవారికి మీకెన్నికష్టములను
కలుగజేసితి మిక్కిలి కఠినమతిని
నిన్ను కనుగొన వెనుకాడుచున్నదాత్మ
ప్రియము మీరంగ నన్నాదరింపుమమ్మ!

పార్వ; ఆదరణగా దగ్గరకు తీసుకొని నీ దోషమేమీ లేదు తల్లీ! అంతా నాపాపమే.

రంగా; (ముందుకువచ్చి ఎందుకండీ! అంత కలవరపడి మాట్లాడు తారు. ఇప్పటికి మించిపోయిన దేమీలేదు. అన్ని విషయంలు క్రమంగా చక్కబడతై. లేనిపోని విచారాలు తెచ్చిపెట్టుకొని శరీరం చెడగొట్టుకొనకండి.

పార్వ; నాయనా! రంగారావూ! నీవుకూడా వచ్చావా? రా! నాయనా! రా! చిన్నప్పటినుంచి పరిచయంగా వుండేవాడివి. ఈమధ్య నిన్ను చాలాతూలనాడినాను. మనస్సులో పెట్టుకోబోకు.

గంగా; అమ్మాయి వెళ్ళింది. మళ్లీ అన్నంగాని నీళ్ళుగాని ముట్టటం లేదు. ఆదిగులుతోనే ఈవిధంగా మంచం బట్టింది. అందరూ రావటం పోవటం మానేశారు.

పార్వ; ఆయేర్పాట్లన్నీ శ్రమనుకోక సుబ్బావధాన్లుగారే చేస్తున్నారట.

రంగా;. ఆయనకొకసారి తగినశాస్తి జేస్తేగాని కుదురదు.

గీ॥ చూడరెవ్వరు మమ్మని కూడనిపను
లెన్ని జేసిన యపకీర్తి యేమిలేదు
సత్యముగ యొక్కనినిజెంది సౌఖ్యమొంద
చెడ్డపనియని యల్లరిసేయు జగము.

సుంద: చుట్టాలలో ఆపదకక్కరకు వచ్చేవారు యెవ్వరూ వుండరు. ఉన్నంతవరకు వూడ్చుకు తింటారు. యేపెండ్లైనా ఫరవాలేదు. నిండుగా తిండికి దొరకనిపుంట బయలుదేరుతై యీ ధర్మ పన్నాలన్నీ. అప్పుడు శాస్త్రాలు వినిపిస్తారు - ఆచారాలుచూపి స్తారు - ఎన్నిపాట్లో పడతారు.

పార్వ: అంతే అయింది మంగతి.

గంగా; మనమెప్పుడూ లోకాన్ని మెప్పించలేం. పరలోకమున్నది, భగవంతుడున్నాడు అనే చూపుతో అన్యుల కపకారం కోరక సంసారనౌక చక్కగా సాగటానికి అడ్డుకట్టలుగావున్న యిటువంటి విషయాలనన్నిటినీ నిర్భయంగా - నిర్మోగమోటంగా - పార జిమ్మి నిరాడంబరంగా జీవితప్రవాహాన్ని దాటాలి.

పార్వ: . అందుకనే యింతటితో అందరి జోక్యం మానుకున్నాం.

రంగా; ముందు మీ దిగులుమానండి! శరీరారోగ్యమైనమీాదట అన్నీ చక్కబెట్టుకోవచ్చు.

పార్వ; నాయనా! మీరు వచ్చారు సగంప్రాణం లేచివచ్చింది. ఇవ్వాళ యింతవరకు మందుకూడా లేదు.

రంగా; తొందరపేదు తగ్గిపోతుంది లెండి. మందు తేవటానికెవరూ లేరా ?

పార్వ; నిత్యం డాక్టరుగారి జమానిచ్చి వెళ్లేవాడు. యింకా రాలేదు.

సుంద; అమ్మా! ఇక మందుతో అంతపని వుండదు.

(జమాను వెంకయ్య మందులసంచితో ప్రవేశించును.)

వెంక; (మందిచ్చుచు) ఇదుగోనండీ! ఔషధం. ఈ వారానికి వాడిన దానికి డాక్టరుగారు బిల్లుచేసి యిచ్చినారు. రు. 8-6-0 లు అయినది. ఇంతవరకీ డబ్బివ్వండి.

పార్వ; వెంకయ్యా! కొంచెం స్వస్థతచిక్కనియి నాయనా! ఇస్తాలే.

వెంక; అట్లాపీల్లేదు. ఇంతవరకీమొత్తం చెల్లించవలసినదే. లేకుంటే రేపు మందు పంపరు.

పార్వ; (విసుగుతో) పోనీలే మానుకోండి.

రంగా; రోగియొక్క రోగనిదానంతో పనిలేదా ?

వెంక; లేదు. ముందుబిల్లు చెల్లించవలసిందే ?

రంగా; ఇదుగో తీసుకో. (అని యిచ్చును)

వెంక; (వెళ్లుచూ తనలో) అప్పుడే యీనూతనదంపతులు వచ్చి దిగి నారే? ఈసంగతి సుబ్బావధాన్లగారిచెవిలో వూదవలసిందే. (వెళ్లును)

పార్వ; అయ్యా! రంగారావుగారూ! మాతప్పులు మరచిపోయి అప్పు డప్పుడూ వచ్చిపోతుండండి నాయనా!

రంగా; అబ్బాయి! చాలాప్రొద్దుపోయింది. చీకటిరోజులు, ఇక వెళ్లండి.

పార్వ; రేపొకమాటు వచ్చివెళ్లండి.

రంగా; అలాగే.

(తెరవాలును)

## 3 - వ రంగము

వెంకటరెడ్డి గారి యిల్లు.

వెంకటరెడ్డి వసారాలో కుర్చీపై కూర్చుండియుండును. ప్రక్కన కొంచముదూరములో వెంకటదాసు నిలంబడియుండును.

వెం॥ రె; వెంకటదాసూ! ఈ విషయంలో నీవు కలుగజేసుకోవద్దు. నామాట విను. ముందు పారజూచుకో.

వెం॥ దా: రెడ్డిగారూ! నేను నోరెరుగని బీదజనంకోసం న్యాయ సమ్మతంగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నానుగాని నా స్వప్రయోజనానికి కాదు.

వెం॥ రె; ఈ విషయంలో న్యాయమనిచూస్తే మాటవినరు.

వెం॥ దా; అయ్యా! మీరు గ్రామానికి పెద్దలు, ధనికులు. న్యాయమెరిగివుండీకూడా మీరే విరుద్ధంగా కోపించి మాట్లాడితే ఇక మా మొరాలించే వారెవరు?

వెం॥ రె; కోపముతో లేచి యిటునటు తిరుగుచు ఎందుకోయ్! నీ యీవేదన. మా ఖజానాపెట్టెలు వృథాగా చూరబెట్టటమే కాని యిచ్చినా వీరు దక్కించుకోలేరు.

సీ. "బీదల" మని బొంకి పీడించి తెచ్చిన
ధాన్యమంగటబెట్టి తప్పత్రాగి
"పసిబిడ్డ లీవేళ పస్తుండి" రని కొంత
చేత దక్కించుక చిత్తులాడి
ఏ పుంటకోకాని, యేగాని, మిగిలిన
పోకుగుడ్డల క్రింద నున్న జుట్టి
అప్పుదొరికిన యప్పుడది శూన్యమగుదాక
అన్నివంటలతోడ నారగించి

గీ. ఉన్నదంతని దినములో మన్ను జేసి
"మీరుదింటిరి మాకేమి మిగుల" దనుచు

క్రూరతనమున ధనికుల తూలనాడి
తిరుగు కూలిజనంబుపై కరుణయేల ?

గడచిన సంవత్సరం ఎక్కువకూలే యిచ్చాం. ఇప్పుడేది ?

వెం॥ దా॥; ఇవ్వాళ యిచ్చింది రేపటి కయిపోతుంటే గడచిన సంవత్సరం యిచ్చింది వేసంగినీ, వర్షాన్నీ దాటి యిప్పటిదాకా వుంటుందా ?

వెం॥ రె; వీళ్ళు తప్పదాగి వాళ్లుమరవకుంటే యెందుకుండదు?

వెం॥ దా॥ 'వినయంగా' అలా అనకండి స్వామీ ! మీరిచ్చిన నాలుగణాలతో నలుగురు బిడ్డల్ని, తమ పొట్టల్ని సంబాళించుకొని అందులో మరికొంత లేనిరోజులకని వుంచుకోవటంకుండా ?

వెం॥ రె; సుఖంలేదు వెంకటదాసూ ! దయదలచి వీళ్ళకిచ్చినా యే విధంగానో నష్టపరుచుకోవటమేకాని నిలుపుకోలేరు.

వెం॥ దా; మీరలా సెలవిస్తే యెట్లా ? ఈబీదకుటుంబాలకు గతేమిటి చెప్పండి.

సీ॥ పగలెల్ల చెమటోడ్చి పడినపాటునకిచ్చు
కూలిగింజలలోన కొంత గుంజి
లేమిడి దినముల రెట్టివడ్డీలతో
అప్పిచ్చి కొంపల నమ్మివేసి
ఇబ్బంది కనిపెట్టి ఇల్లుపొలంబును
తాకట్టు బెట్టించి తలలుగోరిగి
కడుపుగట్టి మిగిల్చి కడునమ్మికను దాచు
ఇవ్వనే లేదని యెగురగొట్టి
గీ॥ బీదప్రాణాల రక్తముల్ పీల్చికట్టు
ముల్లెలనుజూచి తమలోన మురిసికొంచు
తిరుగ బాడియె ధనికులు కరుణలేక
కుక్షి మాదొక్కటేనని రక్షగట్టి.

వెం॥ రె:— ఇంకా మేలు. ఇంతవరకైనా దయదలచి యిస్తానంటున్నా. ఒకణా యిస్తానంటే వందలున్నారు రావటానికి.

వెం॥ దా: (వినయంలో చురుకుదనము చూపుతూ) రెడ్డిగారూ! అలా అనకండీ! వెనుకటికాలం కాదిప్పుడు. ఎవరివరకు వారు తమ స్వశక్తిని గ్రహించుకోగలుగు తున్నారు. ఎవరిపొట్టను వారు కొలుచుకో గలుగుతున్నారు. కాబట్టి మీరు తీవ్రంగా పట్టుబడితే, వారూ ఆ స్థితికేవస్తే చాలా సంకటమౌతుంది.

వెం॥ రె;— (కోపంతో) ఏమిటోయ్! ఈ బోధంతా రంగారావుయేర్పాటు చేయించి పంపినాడా యేమిటి. పాపమా రామశాస్త్రి కడుపున చెడబుట్టినాడు. యీవదాస్తిని, కులాన్ని పోగొట్టుకొని మీ పల్లెకుచేరిన అతడున్నూ, నీవున్నూ యీ తంతంతా నడిపిస్తున్నారు. లేకపోతే యేనాడైనా మా మాటకు మారుబలికి యెరుగుదురా? కానివ్వండి ఎంతవరకు నడిపిస్తారో చూస్తాంకథ. ఏమైనా సరే కాసీగూడా పెచ్చివ్వం.

వెం॥ దా;— (నమస్కరించి) తెగేవరకు బిగించవద్దని నా మనవి.

వెం॥ రె; మీరు తలదెంచే దేమిటో చూద్దాంలే?

వెం॥ దా;— సరే తరువాత మీ యిష్టం. (వెళ్లును)

వెం॥ రె; ఏమి చూచుకొని వీడి ధైర్యం. ఒరే వెంకటప్పా!

జీతగాడు వెంకటప్ప ప్రవేశము.

వెంక:— ఏమిటి బాబయ్యా!

వెం॥ రె: ఏమన్నార్రా! కూలీలు?

వెంక; రెండణాలకంటే ఎక్కువివ్వటానికి వీల్లేదన్నాను. రంగారావు వెంకటదాసుగార్ల నడిగి వారేమి చెపితే అది చేస్తారట.

వెం॥ రె:— తెలివితక్కువ వెధవలు. రేపు కూటికిలేక చస్తుంటే వీళ్ల పెళ్లాంబిడ్డల్ని ఈ రంగారావు వెంకటదాసూ రక్షిస్తారుగామాలు. అసలు వాళ్ల వుద్దేశ్యం ఏమిటిరా!

వెంక; అంతావోకకట్టుమీద నిలిచేటట్టు రంగారావు ప్రమాణం చేయించాడు.

వెం॥ రె; పాకం ముదురుతున్నదే? పోనీ పరాయిగ్రామాలనుంచి పిలిపిద్దామా?

వెంకః— ఈసంగతులన్నీ చెప్పి కూలికీయెవ్వరూ రావద్దని చుట్టుప్రక్కల గ్రామాలన్నిటికీ మనుషుల్ని పంపారట రంగారావుగారు.

వెం॥ రె; ఓహో అదగూడా జరిగిందీ? కానీ వీళ్లెంతకాలం భీష్మిం చుకు కూచుంటారోచూతాం.

వెం కః పైరంతాయెండి యిప్పటికే కుమిలిపోతున్నది. పైనమబ్బులు వస్తున్నాయి. వానేమో వంద్రేమో, మనమింకా ఆలస్యంజేస్తే అసలుకే మోసంవస్తుందని అనుమానమేస్తున్నది.

వెం॥ రె; పోనీలే వెధవలు తినిపోతారు. మూడణాలు యిస్తానని చెప్పి రాపో.

వెంక: నాలుగుఅణాలకు చిల్లిగవ్వతక్కువైనా వాళ్లదగ్గరకు రావద్ద న్నారు.

వెం॥ రె; వాళ్లు తెగించే నిలవబడ్డారన్నమాట. సరే నీవుపో. తరువాత చెబుతాగాని.

(వెంకటప్ప పోవును)

వెం॥ రె;— ముందిక చేయవలసిందేమిటి? వాళ్ళడిగినట్లు యివ్వటానికి అభ్యంతరంలేదుగాని పరువుబోదు? అయినా సుబ్బావధాన్లతో గూడా సంప్రదించి కర్తవ్యం నిర్ణయించటం మంచిది.

(నిష్క్రమించును)

# న్యాయం

## నాలుగవ అంకము

వేదాంతమఠం. లోపల తెర వేసియుండును. తెరలోపల ప్రణవానంద పరమహంస స్వాములవారు. వయసు 40. కాషాయ వస్త్రములు. దండము, కమండలము, పావుకోళ్లు, తలపైన వెంట్రుకలముడి, గడ్డము, మీసములు. మెడలో రుద్రాక్షలు. కామమ్మ, సుబ్బమ్మ, శ్యామలమ్మ, సుబ్బావధాన్లు. (మూడవ అంకం 1 వ రంగంలో వలెనే యుందురు)

వెంకమ్మ వయసు 30. రంగుచీర. ముత్తైదువ.
వీరయ్య. వయసు 35. సామాన్యదుస్తులు.
వెలుపలి వరండాలో కూర్చుండి వేదాంతచర్చ చేయుచుందురు.

కామ;— సుబ్బమ్మొదినా! ఏజన్మానోమ్మో చేసుకుంటేనే గాని ఇంతటి మహానుభావుడు దొరకడమ్మా!

వెంక: కామంపిన్నీ! గొప్ప అనుభవం గలవాడు సుమా!

కామ: కాందే ఈ సంసార బంధాల్లోనుంచి వొడ్డెక్కిస్తున్నాడా? వెంకమ్మా!

సుబ్బ: ఒదినా! ఇటువంటివారు ప్రజాక్షేమమే తమ క్షేమంగా చూస్తారు. కాందే స్వంత సంసారానికి సున్నజుట్టి బయలుదేరుతారా?

కామ: కష్టపడి యెన్నిబోధలు చేస్తున్నా, యెన్ని బంధాలు నేర్పుతున్నా కానీగూడా ముట్టరుగదా!

వెంక: పిన్నీ! బంధాలేమిటమ్మా! ఆసనాలు.

సుబ్బ: (నవ్వుతూ) ఒట్టి అమాయికపుది కామమ్మొదిన. ఆసనాలని చెప్పబోయి బంధాలంటున్నది.

కామ: ఏమైతేనేం అంతావొకటే. ఆక్రోంచెం కీలకం తెలుసుకుంటే- ఈతర్వాత మూడిందిమొదలు యేకధారగా యేడుస్తుండేదాన్నా ? వీరిదాపుకు చేరుకున్నా మళ్లీ మావారిని తలుచుకుంటే ఒట్టు. అట్లా దేహం మరచిపొయ్యేటట్టు బోధిస్తారు.

సుబ్బ:- నే నెరగనమ్మా ! యిన్నాళ్లదాకా. ఎప్పుడూ నాకీ మాయ సంసారంలోపడి కొట్టుకోవటమే సరిపోతున్నది.

కామ: ఎందుకమ్మా ! ఈ సంసారాల వ్యామోహం. వెళ్లి పొయ్యే టప్పుడు వెంటవచ్చేది యేదీలేదు. ఇంత మంచిగురువు మళ్ళీ దొరకటం కష్టం. కాబట్టి ఒకరోజు భిక్షజేసి వీరితోనే ఆ మొక్కు కాస్తా తీర్చుకో.

వెంక: నిజమేనమ్మా ! అట్లాచేయి బాగుంటుంది.

శ్యామ:- ఏమి రాచకార్యాలమ్మా అవి. తెరిపిలేకుండామాట్లాడుతారు.

కామ: (మూతి దిప్పుతూ) నీవు మహాతెలిసినదానివి గాబట్టి యోగం బట్టి కూచుంటావు. తెలియనివాళ్లం నలుగురం ఒకచోట చేరి నప్పుడు మాట్లాడకుండా యెలా కూచుంటాం ?

శ్యామ: మంచిమాట కెందుకమ్మా ! అంతకోపం. వేదాంతంలో పట్టంచేతగామాలు.

సుబ్బ: ఉండండి. మీ మాటలు కాలిపోను. అరుగో స్వాములవారు.

(తెర యెత్తుదురు.)

(స్వాములవారు, సుబ్బావధాన్లు, వీరయ్య కనిపింతురు.)

స్వామి: శివోహం శివోహం శివోహం. సుబ్బావధాన్లు ! మీకు జెప్పిన కీర్తన అంతా కలిసిపాడండి ?

(అందరూ కలిసి కీర్తన పాడుదురు.)

సున్నసున్నా సున్నసున్నా, జగ మున్నాదానుటే సున్నా

పుట్టుటమొదలే సున్నా, పుట్టి పెరుగూటలన్నీ సున్నా, వట్టియింశలచేత, పట్టూబాడాకాయీా, గుట్టూదేశికునోట, గట్టీగా దెలుసుకో ॥ సు ॥

లోకాలోకములన్నీ సున్నా, వున్న లోకేశులందరు సున్నా. సాకారమాదిని - రాకారపర్యంత, మేకామైయున్నట్టి, యమనీయామము లన్నీ ॥ సున్న ॥

కామ: స్వామీ! ఈ దాసురాలికేవో తారకం జూపిస్తా మంటిరే?

స్వామి: ముందు బోధ చక్కగా మనస్సున కెక్కాలి. తర్వాత గురువులమీద, గురువాక్యంమీద గట్టి విశ్వాసంగలగాలి. అప్పుడూ తారకమైనా, పరిపూర్ణమైనా?

సుబ్బా; ఇందులోదిగి ఒక్కనైనా నిండాగాలేదు. ఇంతలోనే పరిపూర్ణాలు వస్తయ్యాయేమిటి. చెప్పండిస్వామీ! బోధేచెప్పండి!

స్వామి:

గీ. తనువు మనమును ప్రాణంబు ధనముగూడ
గురుమహాదేవులకు గూర్చి, యెరుకవిడిచి
సర్వమును వారిపాలేసి శాంతిగన్న
ముక్తి యరచేతిలోసిద్ధైపోదె మీకు.

కొద్దిమాటలలో సమస్తం బోధయ్యేటట్లు చెపుతా సావధానంగా వినండి. మనకన్నులముందు యెందరోపోతున్నారు. చూస్తున్నాం దేహమెప్పుడూ అసత్యమే. దేహానికే నిలకడ లేనప్పుడు దాన్ని చుట్టుకొనివున్న దారపుత్ర పశుధనములకు నిలకడ యెక్కడిది? దీన్నినమ్మి ముందు వైరాగ్యం సంపాదించాలి.

సుబ్బా: అది కుదరదే. దాన్ని ఎట్లా సాధించాలి స్వామీ!

స్వామి: దానికి కొన్ని సిద్ధయోగా లున్నవి. అవి వేరే చెప్పాలి.

సుబ్బ: ఒకరకంగాదు. అన్ని పంపాయించారు మహానుభావులు.

స్వామీ: మాయ. జగత్తంతా మాయ. యోగదృష్టితో చూచినప్పుడు ఇదంతా వుత్తబట్టబయలు. అంతా అబద్ధమైనప్పుడు అందులో మన దేహమొకటి నిజమౌతుందా?

కామ: కాదు.

స్వామి: కాబట్టి లేని దేహంతో చేసేకర్మలు నిలవవుంటవి అనుకో వటం తప్పు. కనుక కర్మలతో పుణ్యాపాపా లొస్తాయి, ఇహాలోక పరలోకాలొస్తాయి అనుకోవటం బుద్ధిలోప మేకాని మరియొకటి కాదు.

కామ: అక్కడేవున్నది కీలకం.

స్వామి: అందుచేత పరలోక భయాన్ని పూర్తిగా విడిచివేయాలి. ఈజ్ఞానం కలిగినతర్వాత అంతా ఒక దీర్ఘస్వప్నం. స్వప్నంలో జరిగినవాటివలన మనకు ఫలాఫలాలు యెలాలేవో, అలాగే యీ జాగ్రతులో జరిగేవాటికి కూడా ముందు అనుభవించవ మనేది లేదు. ఇదే వున్నరహస్యం.

శ్యామ: (తనలో) ఈబోధంతా ఏమో మాయగావుంది. నాకేమీ తెలియటంలేదు.

వీర: పుణ్యం పాపం యేమీలేనప్పుడు ఇదంతా యెందుకు స్వామీ!

స్వామి: ఆగుట్టు తెలుసుకోవటానికే ఇదంతా అనుభవం చేసుకోవా లంటే కొన్నాళ్లు యోగాభ్యాసం చేయాలి.

కామ: (జనాంతికము) సుబ్బమ్మా! చూచావా? ఎంతచక్కగా ముక్కకుముక్క విడదీసి అర్థమయ్యేటట్టు చెపుతారో.

సుబ్బ: (జనాంతికము) నిజమేనమ్మా! ఇదందా వొట్టి మాయగాక చూస్తే ఇంకా యేమున్నదిచెప్పు.

సుబ్బా: స్వామీ! యోగాలు, ఆసనాలు నాకు చేతకావు. ఈసంసా రంలో నుంచి వొడ్డెక్కితా. ఇంతో అంతో బోధే చేయండి.

స్వామి: 'ఏసాధననీకేటికి వీసానికి పనికిరాదు వినరాఅయ్యా' అన్నారు పెద్దలు. ఏవీ అవసరంలేదు. సద్గురువుల సన్నిధికి చేరితేచాలు సమస్తం చక్కబడుతుంది.

వెంక: — అందుకే ఇంటివారంతా వద్దంటున్నా ఎట్లాగో వీలుచేసికొని వస్తున్నా.

సుబ్బ: అంతే చేయాలి. ఇంటిలోని యీ జంజాటమంతా వున్నంత వరకు రక్తంపీల్చుకొని తినేదేకాని వెంటవచ్చేది యేదీలేదు. ఇటువంటి మహాత్ముల పాదసేవ వొక్కటిమాత్రం వస్తుంది వెంట.

కామ: మనంతరించేదేదో అడిచూచుకోవాలిగాని ఇంకెందుకమ్మా! ఈ పిల్లలూ సంసారాలూను.

శ్యామ: (తనలో) ఎవళ్లైనా ఈమె వొక్కతెమాత్రం కొద్ది రోజుల్లో వెళ్లేటట్లున్నది గురువుగారితోలేచి వైకుంఠానికి.

కామ: స్వామీ! నా మాట యేమిజెప్పారు. ఈ మహోదరవ్యాధి కుదరటానికి యేదో యోగం బట్టిస్తామంటిరే?

స్వామి: అవును. దీనికి యేకాంతంగా వుడ్యాణబంధయోగం చేయాలి. గోసాయి చిట్కా లోనికి సేవించాలి.

సుబ్బా: స్వామీ! రేపటి భిక్ష యెవరిది?

వెంక: ఈ సుబ్బమ్మగారు రేపు కారణం దీసుకుంటుందట వీరిదేభిక్ష.

(గంగాధరశాస్త్రి ప్రవేశము)

గంగా: తీర్థపాదులకు నమస్కారాలు.

స్వామి: శివోహం. శివోహం. శివోహం.

సుబ్బా: ఎన్నడూ రారు శాస్త్రిగారు, ఇలాదయచేశారు యేమిటి విశేషం.

గంగా: స్వాములకు రేపు మా యింటిదగ్గర పాదపూజ చేయించండి!

సుబ్బా: అలా వీల్లేదు.

గంగా:— ఏమీ? మా భిక్ష యెందుకు పనికిరాదు?

సుబ్బా:— పనికిరాదయ్యా! అంతే. కూతుర్ని మాలవాడలోజేర్చావు. ఇంకా నీకు కులమెక్కడిది?

కామ:— (తనలో) అడగవలసినమాట ముఖాన్నే అడిగినాడు. కుదిరింది.

గంగా:— కులంకోటకేకదా? పుత్రికావిషయంలో ప్రేమను పూర్తిగా వదలుకొని ఇలావున్నది.

సుబ్బా:— అందరికీ వుంటుంది ప్రేమ. ఉంటే ప్రపంచమర్యాదలు పాడు జేస్తారా ?

వీర:— పోనియ్యండి అవధానులుగారు ! వీరేంజేస్తారు. పిల్లకు బుద్ధి పుట్టింది పోయింది.

సుబ్బా:— పోనిస్తే రేపువీరినిచూచి మరొకరు నేర్చుకొంటారు. స్వామి ఇట్లాంటి పాపులచేతి దేదీముట్టరు.

గంగా:— ఇది దేనికంటే గొప్పపాపమో తెలియటంలేదు.

సుబ్బా:— తెలియదు, తెలియదు. కూతురుని అల్లుడుని రోగమనిచెప్పి ఇంటికి రప్పించుకోవటంమాత్రం తెలుసు.

శామ:— (జనాంతికము) చూడుసుబ్బమ్మ ! ఇంతజరుగుతున్నా మన లోకమేమైనా వున్నదేమో స్వామికి.

సుబ్బ: ఏ వేడోమెట్టులోనో వున్నారు.

వెంక: అట్లావుండకపోతే మనతోపాటేగా ?

శ్యామ: ఏంపాటో నాకంతా గారడీగావుంది.

శామ: నీకట్లానే వుంటుంది.

(గోపాలరావు, మధుసూదనరావు, రంగారావు ప్రవేశము)

ముగ్గురు: పూజ్యపాదులకు నమస్కారములు.

గోపా: ఇదుగో చేరుకున్నారు రకంవారీ అంతా.

మధు: అవధాన్లుగారు ! వీరిప్పుడు మాట్లాడరా యేమిటి ?

సుబ్బా: అవసరమైతే తప్ప ఎప్పుడూ సమాధిలోనే వుంటారు.

రంగా: వీరి నామధేయం ?

సుబ్బా: శ్రీ శ్రీ శ్రీ ప్రణవానంద పరమహంస స్వాములవారు.

రంగా: వీరి వాలకానికి ప్రణయానందులవారంటే బాగుండేది.

స్వామి: (తనలో) ఇదియొక అల్లరిమూక.

గోపా: శాస్త్రిగారు ! తమరుకూడా వీరిబోధకేనా దయచేశారు.

గంగా: భిక్షకు ఆహ్వానించటానికి వచ్చాను. కాని సుబ్బావధాన్లు గారు మాభిక్ష పనికిరాదంటున్నారు.

రంగా: వారు పండితులైన పరమవేదాంతులు గనుక.

గోపా: గొప్ప వ్యవహారంలోనే ప్రవేశించారు అవధాన్లుగారు.

మధు: భగవంతుడు సాధుజనులయందున్నాడు. ఇటువంటి పొట్ట కూటి పరమదాంభికులలో లేడు.

గంగా: ఏదో లోకాచారంగా చేస్తామనుకున్నాను.

వీర: గురునింద జేస్తున్నారు. చాలా దుర్మార్గం.

సుబ్బా: మూఢులకేమి దెలుస్తుంది?

స్వామి: అవధాన్లు! తొందరపడకు. ఇది మాయాప్రపంచం. అజ్ఞాన లోకం. ఇష్టంవచ్చినట్లు మాట్లాడుతుంది తెలుసుకోలేక.

రంగా: తెలుసుకున్నాం స్వామీ! మీ మహిమంతా తెలుసు కున్నాం. ఎంతవారుగాందే శాస్త్రిగారి భిక్ష గ్రహించరాని దౌతుందా?

గోపా: స్వామీ! తమ తత్త్వమేమో కొంచెం బోధచేస్తారా!

స్వామి: శాంతంగా కూర్చుండి వినండి! కామమ్మా! పాడు.

కామ: (కీర్తన.)

శివోహ మనరాదురా! వో జీవా। శివోహ మనరాదురా! శివోహ మనకున్న పరమూను గనలేవా। దురితపుంజములన్ని, తొలగూను తనుగన్న ॥ శివో ॥

ఉన్నదొక్కటి లేదురా లే। కున్నదొక్కటి కలదురా। పన్నూగ యీ గుట్టు। పరదేశికులచేత। తిన్నాగా విన్న నీ। కున్న దేదియు లేదు ॥ శివో ॥

మధు: బాగున్నది. ఇది పరమహంసులవారి విరచితమేనా? ఇంతేనా వీరి వేదాంతం.

గోపా: ఇంకా యేముంటుంది వేదాంతమంటే. తన్ను తాను తెలుసు కోవటమే.

రంగా:— అంతేకాని కామక్రోధా లెట్లా జయించాలి, శమదమముల నెలా చేర్చుకోవాలి అనే దక్కర లేదన్న మాట.

గోపా: వీరిబోధలో ఉన్న దేలేమగా! కాబట్టి అవసరానికి కామాన్ని తీర్చుకోవాలి, క్రోధాన్ని లోకులమీద విసరాలి, దేహమే లేదు. కనుక దేహంతో దేహంతో కలిసి చేసేకర్మ అసలే లేదు.

రంగా: దీనితో పుణ్యపాపాలు పొట్టుతో ఎగిరిపోయినై.

మధు: అవి ఉంటే వీరి ఆటలు సాగేదెట్లా ?

కామ: (రహస్యంగా) ఎట్లాగమ్మా ! మాయముండాకొడుకులేదో అల్లరిచేసిపోవటానికి వచ్చారు.

సుబ్బ: 'రహస్యంగా' మంచిపనుల కింతే విఘ్నాలమ్మా?

వెంక: ఎంతరహస్యంగా నడుపుకుంటున్నా వెధవలు ఎక్కడవింటారో చెడగొట్టటానికి వచ్చిపడతారు.

శ్యామ: (తనలో) వెధవలపొగరు ఈదెబ్బతోగాని అణగదు.

సుబ్బా: (కోపంతో) హద్దువిడిచిమాట్లాడుతున్నారు. ఇంగ్లీషులేడ్చిన శుద్ధశుంఠలకు శాస్త్రరహస్యం మీకేమి తెలుస్తుంది. పోండి అవతలికి.

రంగా: శాంతించండి అవధానులుగారు ! నీవొక్కకడుపుకక్కుర్తికి ఎన్నికాపురాలు కూలదోస్తున్నావో చూడు

గోపా: పొట్టపొడిచినా అక్షరంముక్కలేదు. శాస్త్రం శాస్త్రం అని కొట్టుకుంటావెందుకు?

మధు: పొట్ట నింకొకవిధంగా పోషించుకోలేక దేశద్రోహులై వచ్చే మాయవేషాల మహాత్ములపాలబడి పరిశుద్ధబ్రహ్మవిద్య పాడు బడుచున్నది.

సుబ్బ: ఈదుర్మార్గులతో స్వామివారిక మాట్లాడరు.

కామ: సర్వమును జయించినవారికి యీమాట లేమిజేస్తయి?

గంగా: ఏపుట్టలో ఏపామున్నదో తొందరపడి మాట్లాడకండి.

రంగా: మీరింత అమాయికపు నమ్మకంగలవారుకనుకనే మిమ్ములను బెదిరిస్తున్నారు. ఎన్నో శాస్త్రాలు కావలెనా గుణవంతుడై నడుచు కోవటానికి? ప్రపంచానికంతటికీ తారకమైంది ఒక్క భగవద్గీతచాలు. స్వేచ్ఛగా తిరిగే మనసును స్వాధీనంచేసుకొని సర్వజీవులను సమ దృష్టితో చూచి, తనలోని ప్రేమజ్యోతిని సర్వత్ర ప్రకాశింపజేసి, సర్వకర్మలు పరమేశ్వరార్పణం చేస్తూ, దేనికిని తాను కర్తగాక, ఈశ్వరకుటుంబమైన జగత్తునకు నేనుసేవకుడననుకుంటూ, తనసం సారాన్ని సరళంగా, నిరాడంబరముగా నడుపుకుంటేచాలు. ఈ దంభాలతో పనిలేదు. "తలలు బోడులైతే తలపులుబోడులా?"

మధు: అవధాన్లుగారు! మాట్లాడరేమి?

వీర: మీరింత అల్లరిగా మాట్లాడటం తగదండి!

కామ: వారు వచ్చిందే అల్లరికి. ఇది వొకజట్టు. ఎక్కడే శుభ కార్యాలు జరుగుతున్నా పడగొట్టటమే వీరిపని. చూడలేరు. కళ్లు మండిపోతై.

గోపా: జరుగవలసిన కార్యాలిప్పటికే జరిగినైగా! కామమ్మతల్లీ! మహాతల్లివి. ఎక్కడా నీయగ్రాసనాధిపత్యమేనా!

మధు: ఈమెకుతో డెందరిని వొడ్డెక్కిస్తున్నది?

గోపా: బుద్ధిలేక యింటిలో మగవారినేడ్పించి ఏకాంచెం వేషగాడొచ్చి దిగినా భక్తి భక్తియని పరుగులెత్తి పాడౌతున్నారు.

మధు: ఇందుకే ద్వితీయాలు చేయమంటున్నది.

రంగా: సుబ్బమ్మా! విను. ఈరోజులలో గ్రంథగురుత్వమేకాని మానవగురుత్వం నమ్మరానిది. ఇంటిలో నలుగురూ వొకచోట చేరి నీచములుగాని ఉత్తమగ్రంథాలు చదువుకొని, సత్యంలో శాంతంలో ముందు కెంతసాగినాము. కామక్రోధాల్లో ఎంత వరకు విజయం పొందినాము. అని యెప్పటికప్పుడు చూచు

కుంటూ వుండాలిగాని ఇటువంటి వారినినమ్మి విడబడి తిరగరాదు. తెలిసిందా ?

గోపా: కామమ్మా ! నీ కథ తర్వాతచెపుతా ముందిక్కడినుంచి కదలండి.

కామ: చిక్కముఖంతో స్వామినేమి చేస్తారో. ఎడబంధాలు చేస్తున్నారు.

సుబ్బ: మన వూరినుంచి సాగనంపుతారు. ఇంకేం జేస్తారు వెధవలు. (అనుకొనుచు వెళ్లుచుదు.)

మధు: అవధాన్లుగారు ! ఇంతటితోనైనా బుద్ధిదెచ్చుకొని ఇటువంటి కానిపోనివాట్లలో కల్పించుకొనకండి ! లేవండి మేముకూడా వస్తాము స్వాములను సాగనంపించండి.

అందరూ లేతురు – తెరపడును

శ్రీ ర స్తు

# న్యాయం

## అయిదవ అంకము

### 1 - వ రంగము

(మాలపల్లె. పుల్లడు - వీరడు ప్రవేశము.)

పుల్ల: ఈరిగా! ఇంకా యెన్నాళ్లురా యీ అవస్త.

ఈర: ఏమోరా! అంతా దైవమాయగావుంది. అంకమ్మ మనమీద కసిబట్టినట్టుంది.

పుల్ల: ఆమెకు శాంతికోసం పదిరోజులునుంచి కొలుపులు కొలుతుండాంగందా ఇంకా శాంతించలేదేం.

ఈర: నన్నడిగితే నాకేం దెలిసిద్దిరా! నేనేం అంకమ్మనా పోలేరమ్మనా? కలరాలో నా మరదలుపోయి నే నేడుత్తుంటే నన్ను డబాయిత్తావేంట్రా.

పుల్ల:— మరదలుబోతే నీకెందుకురా! యేడుపు.

ఈర: అరేబావా! ఇప్పుడు జెప్పినా పరవాలేదు. ఏం పిల్లరా అది. సుక్కలాగుండేది. ఆ పిల్లతో మాట్టాడొద్దని అది. నా యిట్టమని నేను

పుల్ల:— సర్కారోరు. బతికుండగానే తీసుకెల్లారా? చచ్చినాకనా?

ఈర:— నీ దంతా యేలాకోలంరా? బతికుంటే యెందుకు తీసుకెల్తారు?

పుల్ల: ఓసి యెఱ్ఱిమొకమా? నీకంతేనా తెలిసింది. మొన్న నాగులు కొడుక్కి కలరా తగిలి యింకా పానం గుట గుట లాడుతుంటే సర్కారోరి యమదూత లా మరబండిలోవచ్చి మల్లీ యెవరొత్తా

రని గదమాయించి తతిమ్మా పీనిగలతోపాటు యేసుకెల్లారు. పాపం నాగులుగాడు రంగారావుగారితో చెప్పితే వారు సరకారు వుద్దోగుల్తో మాట్లాడి పీనిగల్ని పారేసే సొశానందగ్గిరికి పోయి సూసేటప్పిటికి ఈరగా! ఏం జెప్పేది, నాగులుకొడుకుతోపాటు ఇంకా ముగ్గురు పానాలతోనే వున్నారు. వాళ్లను బండిలో యేసుకొని మందులిచ్చే ఆసుపత్తిరికి తీసుకొచ్చారు. తరువాత వాళ్లు నలుగురూ బతికారు. రంగారావుగారు దేవుళ్లాగా అడ్డ పడకపోతే ఆ నలుగురూకూడా తాతల్లో కలిసిపొయ్యేవాళ్లే.

ఈర: రంగారావుగారి సంగతి యింటే అచ్చర్యమేత్తుందిరా? ఆయన గారెంత మావానుబావుడు కాకపోతే మాలగూడెం ఇట్టా బాగు పడిద్దంటావా? ఆరికితోడు చదువుకున్నందుకు మన వెంకటదాసు కూడా మంచి వుపకారం చేత్తుండాడు.

పుల్ల: అప్పటినుంచి ఊళ్లో పతియీాడికీ రంగారావుగారు తిరిగి కాంగిరెసు వాలంటీర్లను బెట్టి సచ్చినోళ్ళను సొశానానికి, పానంతో వున్నవాళ్ళను ఆసుపత్తిరికి పంపిత్తున్నాడు. అట్లా యేరుపాటు సిసల్బందీ చేశారు. సర్కారువారితో మాట్లాడి తాను పతి యింటికీ పోయి అందరికీ సూదిమందులు పొడిపించి జనానికెంతో దయిర్యం చెప్పి తనకు రోగం తగులుతుందనే బయంలేకుండా వూరంతా తానే కనబడతాడు.

నాగులు ప్రవేశం

పుల్ల:— ఎంరోనాగులు! నీవింకా బతికేవుండావే. సచ్చావని యెవరో అన్నారట్టా యీామద్దె.

నాగు: దేముడుదయుంటే యిట్టాంటి పోలేరమ్మలు ఎందరు సావాల్నే.

ఈర: ఓరి నీతెలివిగాలిపోను. దేముడిదయ గాదురా! రంగారావు గారిదయరా! దయంటే వారిదేగాని ఇంకెక్కడుందిరా?

పుల్ల:— ఎన్నిరకాలో పానాలు దక్కిత్తున్నాడు ఈదెబ్బలో ఈయన లేక పోతే రెడ్డిగారు మనల్ని బతకనిచ్చేవాడేనా ?

ఈర:— వాగు నిలబడకపోతే అప్పైరుకోతప్పుడు మనసమ్మె అసలు సాగేదా ?

నాగు:— ఆయనిక్కడికి రావటంతోనే మారిందేమిరా పల్లెంతా.

పుల్ల:— పల్లె పెపంచం అనుకునేమనకు ఎక్కడెక్కడి సంగతులూ చెప్పి యిట్టామార్చేశాడు.

ఈర: ఈరిద్దయనల్ల తాగుడు మానారు. పిల్లలంతా కడుపునిండాతిని బతుకుతుండారు.

పుల్ల: పల్లె చాలాసుద్దంగా వుందని వేరేచెప్పాలా ? ఈ కలరాలో వూళ్లోకంటే జారిపోవటం ఇక్కడే తక్కువ.

నాగు:— ఎమట్లో కొలువులు యివ్వాళతో ఆఖరు. రేపు బోనాలు చెల్లి స్తారట. మాట్టాట్టానికి రమ్మని రెడ్డిగారు చెప్పిపంపారు.

ఈర:— ఇట్టాంటప్పుడు బాగానే కలుపుకొని మాట్టాడతారు.

పుల్ల: సరే అంతాకలసి మాట్లాడి ఏర్పాటు చేసుకొందాం.

నాగు: సరే పదండి.

(అందరు వెళ్ళుదురు)

## 2 - వ రంగము

మాలపల్లెలో నాలుగు బజారులు కలిసిన స్థలం. అక్కడ మాలలందరు కొలువుల విషయమై మాట్లాడుకొనుచుందురు.

వెంకటదాసు 2-వ అంకం 2-వ రంగంలోవలె నుండును.

నాగులు, పుల్లడు. వయస్సు 35. ధోవతి, వుత్తరీయం కప్పుకొనివుందురు.

సుబ్బడు వయసు 80. మోదకి దోపిన ధోవతి, ఉత్తరీయం మడత. పెద్దమీసములు.

శేషాదాసు వయసు 75. ధోవతి, ఉత్తరీయం, శ్రీచూర్ణంబొట్టు.

ప్రాతకాలపు మనుషులుగా కనబడెదరు.

వెం॥ దా: ఇంతవరకు మనం యెఱుగక యెన్ని హింసలుచేసినా ఇక మీదట అందరూ ఒక మాటమీదనిలిచి, జంతుబలీ, త్రాగుడు

పూర్తిగా మానివేయాలి. పూర్వంనుంచీ మీరు అంటరాని వారు గ్రామానికి దూరంగా వుండాలి అనటం మనయందా నేరాలు మోపే. కాబట్టి ఒకరితో మనకెందుకు వీలైనంత వరకు ఇటువంటి దురాచారాల నన్నిటిని మొదలంటతీసివేయాలి. గ్రామపెద్ద వెంకటరెడ్డిగారు మొన్నవచ్చి జాతర సాగించాలని చెప్పి వెళ్ళినాడట. ఈ పెద్దలంతా యిటువంటి సమయాల్లో బాగానే కలుపుకుంటారు. తిరువాత మీరు మా ప్రక్కన ఉండ దగరు పొమ్మని దూరంగా వూరివెలుపలిదాకా నెట్టుతుంటారు. తెలిసిందా ? ఈ జాతరలో ఎవరూ పాల్గొనరాదు.

సీ॥ వంశవృద్ధిని మీరు వాంఛించుచున్నైన
మారణ కార్యముల్ మానవలయు
ఆత్మాభివృద్ధి మీ కలవడవలెనన్న
మాంసభక్షణమును మానవలయు
అత్యుత్తమస్థానమందు కోరిక యున్న
జీవులన్నిట ప్రేమ జేర్చవలయు
మన హీనదుస్థితి మాన్పుకోవలెనన్న
సద్విద్య గడియింప సాగవలయు
గీ॥ లేండు లెం డింక నంధులై యుండదగరు
మించి సత్కార్యముల నొనరించుపట్ల
కష్ట నిష్ఠురముల నెందు గాంచ జనదు
గాన సంస్కారవిధికింక గడగరయ్య !

సుబ్బ: నాయనా ! ఈవాళ కళ్ళుదెరిచావు నీవు. నేను చాలాకాలం నుంచీవున్నాను ఈదేవతలూ మా తాత ముత్తాతలనాటినుంచీ వున్నై. వాటికి జీవాల నిత్తున్నాం. ఇప్పుడది కాదంటే ఎట్టా గోయ్.

వెం॥ దా: సుబ్బన్న తాతా ! దేవతల మాటటుంచు. జంతుహింస పనికిరాదు.

సుబ్బ: దేముడు మనల్ని పుట్టించిననాడే వాటినిగూడా మనం తినే ట్టుగా పుట్టించాడు. వాటిని తినటంలో తప్పేముంది.

వెం॥ దా: తాతా !

గి॥ ప్రేమపూరిత మఖిలంబు ప్రేమమయుడు
లోకనాధుండు ఆతని లోకమందు
చిక్కటడవిని చరియించు సింహమొకటి
నూర దిరుగాడు కుక్క యింకొకటిగాదు.

శేషా: అయితే మరి యీ జీవాలన్నీ యెందుకు పుట్టినై.

వెం॥ దా: మంచి తెలివిగల ప్రశ్న. నీ వెందుకు పుట్టినావంటే లోకా న్నుద్ధరించటాని కంటావేమో? వస్తువునే మొదలంట నాశనంచేసి మింగడానికి పుట్టలేదు జంతువులు. చక్కగా పోషించి నీ జీవయంత్రయందంతట నుపయోగపరుచుకోటానికి పుట్టినై. ఇటువంటి సదుపయోగజంతువులను శాకాహారాలతో చక్కగా ఆరోగ్యంగా బ్రతకగలిగిన మనం, నాలుక రుచికిలోనై హింసించటం ఎంత దుష్టత్వమో ఆలోచించండి.

పుల్ల: మనుసు లసలు శాకాహరులో మాంసాహారులో తేలాలి.

వెం॥ దా: సృష్టిలోచూడండి. మాంసాహార జంతువులన్నీ మృగాలు పక్షులూకూడా, పగటి నిద్ర, సూదిమొనకోఱలూ, నాలుక మీద గఱుకు, అత్యుష్ణ జఠరాశయం కలిగియుండును. శాకాహారులకు రాత్రి నిద్ర, పారపండ్లు, మెత్తని నాలుక, సమోష్ణ జఠరాశయం కలిగియుండును. మనుష్యు డే జాతికి చెందవలెనో ఆలోచించండి ?

సుబ్బ: పూర్వకాలంనుంచి నీమాత్రం తెలివిగలవారు పుట్టలేదు. మాకు చెప్పలేదు. మేము దింటున్నాం. నీవు చెప్పేమాటలు నాకు తెలవటంలేదు. మాంసం దింటే చెడిపోవటమేమిటంట.

వెం॥ దా:— మన చేతులతో మేతలిచ్చి ముద్దాడిన మేకలను, కోళ్ళను కఠినపు కత్తులతో కుత్తుకలు కోయటం ఎంత పాపమో చూడండి.

సూర: కొయ్యకుండా మాంస మెట్టా వత్తదయ్యా!

వెం॥ దా: తినటమే ప్రధానంగా మాట్లాడే మీతో యెవరువాదించ గలరు. మానవజన్మ మెత్తినందుకు, దేవుడు మన కదనంగా జ్ఞానమిచ్చినందుకు దయనీయమైనహృదయమనేదొకటివున్నందుకు

సీ॥ చేతి కత్తిని జూచి ♦ మూతి మీదికినెత్తి
దీన దృష్టులతోడ ♦ దెసలు వెతకి
ప్రత్యక్ష యమదూత ♦ పాలై ఈనంచును
దిక్కుతోచక వారి ♦ దిట్టుకొనుచు
హా! పరమేశ్వరా! ♦ ఆపదోద్ధారకా!
వేగరావే యంచు ♦ వేడుకొనుచు
ప్రాణభయంబున ♦ పారిపోనేరక
అవని యందున ♦ జీవితాశ విడిచి
అంగలార్చుచు నుండెడు ♦ యజముగాంచ
కఠిన శిలలైన నీరుగా ♦ కారిపోవె?
ఇట్టి కార్యంబునకు ♦ నొడిగట్టువారు
మ్రానులో, దానవులో ♦ మన మనుజు లకట!

శేషా: అబ్బాయీ! నీకు చదువుచెప్పించింది సంపాయించిపెడతావని గాని, లేనిపోని యిట్లాంటి వేవో చెప్పి వుద్ధరిస్తావనిగాదువ్వూంరుకో.

సూర: చదువుకొని వచ్చినందుకు, కతలు, పురాణాలు అట్టాంటివేవో చెప్పాలిగాని; తినటం తాగటంతో నీకేంపని.

వెం॥ దా: తినటం త్రాగటంలోనే వున్నది మన జీవిత విధానమంతా.

శేషా: మనం యెంత చదువుకున్నా, ఎంత శుచిగావున్నా ఈపల్లె దాటి అవలకు ఎవ్వరూ రానివ్వరుబాబు! అసలు పుట్టటంలోనే చెడిపోయి పుట్టినామంట.

వెం॥ దా: లేదు లేదు. తండ్రీ!

గీ॥ పుట్టుకలనెంచ నందరి పుట్టువొకటె
పుట్టువొందిన మీదట బుట్టినట్టి
జ్ఞాన మహిమను పుణ్యాలు మాన్యులైరి—
సంకుచిత జాతి, కుల విచక్షణాలు లేక.

సుబ్బ: అబ్బాయీ! నీవు లచ్చ చెప్పు లాభంలేదు. దీనికే యింత అలమటిత్తున్నావు. సెత్తిపూజలకేం అనేవాడివో.

వెం॥ దా: అక్కడేం జరిగేది తాతా!

సుబ్బ: అది రాళ్ళంగనక అన్నిజాతులవారూ వచ్చేవారు. ఆరోజుల్లో ఆసెత్తి పూజలు యెంత బాగుండేవనుకున్నావు. నీకేం తెలుసు యీకాలపోడికి. మైమగలతల్లి. చూత్తుండంగానే నిండావున్న కల్లు కడవలు నిమిసంలో కాలీలై పోయ్యేయి.

వెం॥ దా: మీరంతా తాగిన తబ్బిబ్బులో వున్నప్పుడేనా?

సుబ్బ: ఎట్టావుంటేయేమి. దేవతే అంగిద్ది కుండలై పోయ్యేటట్టు. ఆ తల్లి సత్తె మెంతసత్తెమోకాని నాలుగైదు జీవాలైనా తెల్ల వారేవరకు సప్పై.

వెం॥ దా: మాతని యేదో వుంటుందంటే అదేమిటి?

సుబ్బ: మాయింటిపక్కనే వుండేది ఆమె. అమ్మవారికి బదులు దేవత. మేమంతా తినటం తాగటం అయినతర్వాత చీపురుతో చేటతో కొట్టి పిపేసి రుద్దితేగాని అసలుదేవత దయరాదు. అంతేనా నోటినిండా కల్లుబోసుకొని ఒకచేత్తో ముంత బట్టుకుని వచ్చి మేము నోళ్లు దెరుచుకొని కూచుంటే మొకాలమీద వూసేది. అప్పుడు మాపానాలు యెక్కడబోయ్యేవో మాకేదీ తెలిసేదికాదు. ఎంత మైమ.

వెం॥ దా: తాతా! ఎంత శాస్త్రినమ్మకాలే మీవి. కైపు తలకెక్కి—వాళ్ళు తెలియక పడిపోయిన మీ మతిలేని తనాన్ని మహిమల్లో దింపేశారు.

శేష: దేవత లెప్పుడూ పట్టియిగావు.

వెం॥ దా: ఆ పూజా సమయంలో అందరూ మీతో కలిసేగా యీ తంతంతా చేసేది. చూచారా! పై జాతులమనేవారు మనకు జేసిన అన్యాయం. ఆరాత్రిపూట అంతాకలిసితిని, త్రాగినవారు తెల్లవారేవరకు దూరంగా వుండు అంటున్నారు.

నాగు: అది రాత్రిపూట రాళ్ళు గనక సాగింది పగులట్టా వూరుకుంటారా యేమిటి? కుడీ యెడమా అక్కర్లేదా?

సుబ్బ: అయినా వెంకటదాసూ! అంతంత పెద్దమారాజులతో పందెం గట్టుకూర్చుంటే వారివల్ల బతికేవాళ్ళంగదా? ఇక సంసారాలు జరిగేది యెట్టా చెప్పు.

వెం॥ దా: . అన్నీ జరుగుతై. జీవహింసతో గూడిన ఈ జాతర వద్దన్నాను. కొంపలు గూల్చే త్రాగుడు మానమన్నాను. ఇవి మాన్తే ఇంత కూడూ గుడ్డా కలుగుతుందిగాని సంసారాలెందుకు చెడతయి.

శేష: అబ్బాయీ! నీ వెన్నిజెప్పినా, ఇవన్నీ మన తాత ముత్తాతల నాటినుంచి వచ్చినై గాని ఇవ్వాళ బుట్టినైగావు. ఇప్పుడెందుకు తప్పించాలి. ఇట్టాంటి పూర్వాచారాలు తప్పిస్తే వొకదారిన వస్తుందనుకున్నావా? కాబట్టి ఈపని మానరాదు.

వెం॥ దా: సరే మీ తల కెక్కినసాటికే విందురుగానిలే. రేపు అక్కడికే వచ్చి కూచుంటాము. ఎట్లా చేస్తారో చూస్తాం.

(అని వెళ్ళిపోవును.)

(తెరపడును)

## 3-వ రంగము

### జాతర.

పోలేరమ్మ గుడి. పసుపు కుంకుమతో నిండి పోలేరమ్మ కనబడుచుండును. వేపాకు తోరణములు. చిన్న పందిరి. ద్వారమందు అన్నము రాశి. పైన జ్యోతి వెలుగుచుండును. పసుపుబూసి కుంకుమబొట్లు బెట్టిన పెదకత్తి అక్కడ బెట్టియుండును. ఒకవైపున మెడలో వేపమండలు కట్టిన మేక అరచుచుండును. ముఖమునకు పసుపుబూసి కుంకుమ బెట్టి వేపమండలు కట్టిన గ్రామదున్న దీనమైన చూపులతో కత్తినిచూచుచు నిలిచియుండును.

వెంకటరెడ్డి సుబ్బావధాన్లు గుడిద్వారమునకు రెండువైపులా కూర్చుందురు. పుల్లడు, నాగులు, సుబ్బడు, కత్తులు పట్టుకొని ప్రక్కన నిలిచియుందురు.

కుమ్మరి గురులింగం వయసు 50 పసుపునిండిన దోవతి పడుముకు పసుపునిండిన వుత్తరీయం బిగించి అమ్మవారు దగ్గరకూర్చుండి పూజించుచుండును.

వెం॥ రె: ఇంకా చూస్తారేమిరా? సుబ్బడు! ప్రొద్దెక్కుతున్నది కానివ్వండి.

సుబ్బ: తమ శెలవుకే యెదురు చూస్తున్నాం దొరా!

వెం॥ రె: సుబ్బడు! నీవు ముందు గ్రామబలికానియి. నాగులుగాడు వేలూరివారి మొదటి బోనం చెల్లిస్తాడు.

కుమ్మ: కాదండీ! పూరవమునుంచీ నూకలవారి బోనం ముందు చెల్లితేనేగాని ఇంకోటి చెల్లదు.

వెం॥ రె: ఏమిటోయ్! ఎల్లకాలం అదేసాగుతుందా యేమిటి? ముందు వేలూరివారి తలే తెగనివ్వండి.

కుమ్మ: అట్టా జేశారంటే చాలా కలతలు గలుగుతై. నూకలవారి తల చెల్లంది ఆ తల్లి రెండో తల ముట్టుకొని యెఱుగదు.

వెం॥ రె: ఏమిరా! సుబ్బడు! పెద్దవాడివి నీ వెఱుగుదువా?

సుబ్బ: ఇవి శాశివితపు అక్కులు దొరా! పెబుత్తం అడ్డరుకైనా తిరుగున్నదిగాని ఈ అక్కులకు తిరుగులేదండీ!

వెం॥ రె: కాలం మించిపోతున్నది. తరువాత విచారిద్దాం. ముందు గ్రామ బలి కానివ్వండి !

(సుబ్బడు పెండలైనవారు దున్నను నరుకబోదురు) ఇంతలో రంగా రావు, వెంకటదాసు, గోపాలరావు, మధుసూదనరావు, వాలంటీర్లు కాంగ్రెసు జెండాలతో స్వరాజ్యగీతం పాడుతూ వచ్చి మధ్యగా నిలుతురు)

వెం॥ దా: ఆగండి. ఆగండి.

(అని కత్తిని పట్టుకొనును)

(అందరు నిశ్చేష్టులగుదురు. వాలంటీర్లు అడ్డంగా పడుకొందురు)

వెం॥ దా: ప్రియసోదరులారా ! నోరెఱుగని జంతువులను నిష్కారణంగా నరకటం తగదు. ముందు మా కంఠాలునరకండి. వెంకట రెడ్డిగారు ! మాయందు పూర్ణానుగ్రహముంచి ఈ జంతుబలిని మాన్పించండి.

వెం॥ రె: ఏమిటీ ఆగడం. ఇక్కడికికు ... మీరే దాపురించాలి. పెద్దలు నడిచినత్రోవను అనుసరించాలిసిందే కాని తప్పించటానికి వీల్లేదు. అది చాలా దోషం.

కుమ్మ: ఏనాడు బుట్టినియ్యో ఈ దేవతలు. ఈనాడు పొమ్మంటే పోతయ్యా !

గోపా: దేవుడొక్కడేకాని ఇన్ని దేవతలుగా లేడు.

సుబ్బా: కష్టాలకు సుఖాలకు అక్కరకొచ్చేటట్టుగా ఈ దేవతలను పెద్దలేర్పరిచారు. మొక్కులనీ, ముడుపులనీ పూర్వంనుంచీ వస్తున్నది. అది యివ్వాళ కాదనటం గ్రామానికి చాలా అరిష్టం.

మధు: అవధాన్లుగారు! మొక్కులు, ముడుపులు, మీ బోనాలతో పూర్తిచేసుకోరాదు. ఈజంతు బలెందుకు ?

రంగా: నోరులేన్నివి. దిక్కులేనివి. కత్తివాయిమీద కంఠమున్నదని యెఱుగక మెడలోగట్టిన వేపమండలనుమేసే అమాయికపు జంతువులు మేకలు, గొఱ్ఱెలుదొరికినై వరసబెట్టె గొంతులుకోయటానికి

"పశువా!" అంటే కోపంవస్తుందే పశువులకున్న జ్ఞానం శాంతం మనకేది ?

సీ॥ మనజోలికినిరాక మనలనే మడుగక
దేవుడిచ్చిన గడ్డి దినుచు తిరిగి
యే కుంటనీళ్ళనో యేవేళకో త్రాగి
దుష్టజంతువులకు తొలగినిలిచి
బ్రహ్మాండమిల్లుగా పరగచంద్రుడు దివ్వె
పరపు నేలలె గొప్ప పరుపులుగను
జేసి, యే జీవిని చెనకి హింసింపక
మెత్తని బుద్ధితో మెలగునట్టి
గీ. సాధు జంతువులను జంప జాలిగాదె ?-
ఒక్కపరి వాని యార్తిత నూహసేయ
ఎంత కఠినాత్మునకునైన చింతరాదె ?-
కరుణచే హృదయంబులు కరిగిపోవె ?

వెం॥ రె: మానవజన్మమెత్తిన తర్వాత ప్రాణి హింసచేయకుండా బ్రతకటం చాలాకష్టం. కష్టమేమిటి వీల్లేదు. జీవికి జీవిని ఆహారంగా భగవంతుడే ఏర్పరిచాడు.

వెం॥ దా: ఆ విధంగా మీరు తోచినట్లంతా సెలవిస్తే యెలాగండీ !

"ఉ॥ మ్రానను రాతనుంగలదె మాంసము ప్రాణులమేనగాక, య
మ్మేనుల నొంచునప్డు దమమేనులు సోకినమాత్ర మెట్లగున్
దాని దలంపగావలదె, తానది మానిన హింసలన్నియున్
మానవెయంచు నుత్తముడు మాంసముమాను దయార్ద్రచిత్తుడై.

అని భారతమునందున్నది. మాంసాహారమును వర్జించి బ్రతుకుట కష్టతరముగానుండు, కేవల శీతలదేశములైన ఇంగ్లండు, అమెరికా జర్మనీలలో జన్మించిన హోవెల్సు, రస్కిన్, కూనే, బేబిడ్ మొదలైన పండితులుకూడా, మనుష్యుడు శాకాహారియే కాని, మాంసాహారి, కాడనిచెప్పిరి. వారు పక్వము చేయనిశాక,

ఫల, మూలములయందే బుద్ధి ...కి, దేహబలానికీ, రక్త
శుద్ధికి తగిన నిజమైన బలకరమైన పదార్థములు కలవని చెప్పుచు
కొన్ని గ్రంథాలు వ్రాశారు.

ఆ॥ వె. అన్యమాంసమున నిజాంగమాంసంబు బో
షించుననుటకంటె జేటులేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలులేదు కర్మజాలకమున. భారతము

ఆ॥ వె. మాంసము తనకున్నమాటను మరచుచు
మాంసముదినునట్టి మాయజీవి
మాంసముచెడిపోవ మాటెట్టులాడురా, విశ్వ॥

సుబ్బ: రామానుజమతంలో మద్యము మాంసములేకుంటే ముద్ద
దిగదే ?

రంగా: అగును.

సీ॥ మాది రామానుజమతము గొప్పదటంచు
రామరామా! చెప్పరానిహింస
చేయదొడంగిరి చెఱచిరి మతమెల్ల
మతసారమెట్టిదో మతియెలేదు
తిరుమంత్రమెఱుగరు తిరుమాళ్లెఱుగరు
తిరువధ్యయనము బొత్తిగనులేదు,
మతకర్తయెంబెరుమానార్ల దివ్య చా
రిత్రంబు తెలియ దేమాత్రమైన,
చరమశ్లోకార్థంబు చదివిజూచుటేలేదు,
పంచసంస్కారముల్ పాడుబడియె
మంచిమార్గములన్ని మట్టిలోద్రొక్కించి
ఎత్తినారిపు డొక్క క్రొత్తమెత్తు,

రంగడుత్రాగేది రంగైనకల్లాయె
పెరుమాళ్ళ తళిహానోపలలచయము,
నమ్మాళ్వారలనంజుళ్ళు కగుకుట్లు
వరప్రపత్తికెముందు బ్రాందిబుడ్లు,
"గోష్ఠి"కై యేపాడు కోంపలోనోజేరి
కోళ్ళను కుక్కల కూలద్రోచి
చెసత్రాగిమత్తులై చెనటిపాటలుపాడి
కైంకర్యమీరీతి గడుపుచుండి,
ఇదిమతమైయైన, యితడు దేవుడైన
మతకర్తయిది చెప్పుమాటయేని
మతమును, దేవుని, మతకర్త నొకసారి
పట్టి సట్టేటిలో నెట్టవలదె
మాంసభక్షణగోరు మాయదైవంబును
పడగొట్టి మెడగోయ పాపమగునె ?

గీ, మతములో సత్యమెట్టిదో వెతకిచూచి
జీవసోదరభావంబు చెదరనీక
రంగనాయకు మది దోలగంగనీక
పుణ్యలోకంబుబొందుట పొలుపుగాదె !

రామానుజులవారే "పులైయుం, కొలైయుం, కళవుంతవిర్". మాంసభంక్షణమును, జీవహింసను, దొంగతనమును విడువుడు అనియు, నారాయణుడొక్కడే ప్రభువు, తండ్రి, జీవలోకమంతయు వాని కింకరులు, వాని కుటుంబము." అనియు సాయించినారు. జీవ సోదరభావమును నెలకొల్ప నుదయించిన యా మహాత్ముడే ఒక జీవిని మరియొక జీవి హింసించుట కోర్తురా ?

తే॥ గీ॥ మతము మతమటంచు మాంసంబు మెక్కుచు
మారుపేరుబెట్టి మధుపుత్రావి
వావి వరుసదప్పి ఒలికిపొలొదురు ॥విశ్వ॥

"మద్యపస్య కుతస్సత్యం । దయా మాంసాశనః కుతః
కామినశ్చ కుతో విద్యా । నిర్ధనస్య కుతః క్రియా॥" అన్నారు.

కమ్మ: మీరు చెప్పే గొడవంతా మాకు తెలవదు. దేవత లిట్టా కోరుతున్నై. అవి అడిగిన వాటిని వాటికియ్య వద్దా? రక్తం కళ్ల జూస్తేగాని మా దేవతలకు తృప్తివుండదు.

రంగా: నీనోటిరుచికి నీవు చేస్తున్నపనేగాని రక్తమే కావలెనంటే ఏ జంతువులో లేదురక్తం?

సీ॥ ఊరిలోనికివచ్చె మారిపోలేర్లని
జాతరల్ సాగించి నీతివిడిచి
నోరెఱుంగని యట్టి గారాబుజంతుల
మెడబట్టి కోతురా మేటితల్లి
కుక్కల, పిల్లులగోరక మేకల,
కోళ్ళనే తినుటకు కోరనేల
తనకునోరున్నచో తానె మ్రింగగరాదె
మిమ్ములబట్టుక మిడుకనేల
గీ॥ నాల్కతీపుకు మీరలేనయము విడిచి
పెట్టుచుంటిరి పోలేరుపేరుజెప్పి
ఆమె మిమ్మెన్నడైనను అడిగెనయ్య!
నిజముజెప్పుడు మీరెల్ల నీతిపరులు.

"గీ॥ వసుధశవముల బూడ్చంగ వల్లకాడు
పేరుగల్గెను, కడు నిరుపేదజంతు
గాత్రములుబూడ్చు మానవగర్భములను
నేమిపేర్పెట్టి పిలువగా నెంతురయ్య?"

కమ్మ: ఆమె సత్తెదేవత. అడుగుతుందిగూడా?

గోపా: మీరు మొక్కేది పూజించేది పసుపూకుంకుమా బెట్టిన సల్ల రాయేకదా? ఏ నోరు బెట్టుకొని అడుగుతుంది దేవత.

సుబ్బా: ఇట్లాంటి దేవతల్లో ఎట్లాంటి మైమలున్నయ్యో మీకేం తెలుస్తుంది. ఒకపర్యాయం మాఅమ్మమ్మకు పోటకంబోస్తే మేకనిస్తామని మొక్కున్నతరవాత నయమైంది. ఇంతలో కరువువచ్చి మాఅమ్మమ్మచచ్చిపోయింది. ఆతరువాత డబ్బుదొరక్క మొక్కున్న నేరానికి కోడిపిల్లనుకొని యియ్యబోతే తీసుకున్నదనుకున్నావా? చూడుమరి వింత. అప్పుడు దేవత మా అమ్మమీద వాలి "నాకిది వద్దు మేకే కావాలి" అని పట్టుబట్టింది. ఏం జేత్తాం. చప్పున మా పూరిల్లు కోమటిగురవయ్యకు తాకట్టుబెట్టి మేకను దెచ్చి మొక్కు చెల్లించుకొన్నా. తాకట్టుబాకీలో యిల్లుబోతే ఇప్పుడు పోలేరమ్మగుళ్లో నే కాపురముంటున్నా.

రంగా: బలే ఉపన్యాసం కొట్టేశావయ్యా గురులింగమయ్యా! అమ్మాపూడే, ఇల్లూపూడే, మొక్కుచెల్లించిన లాభమేమిటయ్యా!

మధు: అంత ఘనమైన దేవతలుండే యింట్లో కాపుర ముండటమే ?

రంగా: లోకసామాన్యంగా అదీ వొక గాలితోబుట్టే రోగమేగాని దేవతగాదు.

సుబ్బా: ఇంత నాస్తికంగా మాట్లాడే మీకు దేవతల్లేవు, దయ్యాలూ లేవు. మడీలేదు మైలాలేదు. అంతా శూన్యమే.

గోపా: జీవహింస చేయరాదన్నంతమాత్రాన నాస్తికులమైతిమా ? యజ్ఞాలనీ, జాతరలనీ, వైష్ణవమనీ, శాక్తేయమనీ, నోరెరుగని జంతువులను వందలు వేలుగా మీ పొట్టనబెట్టుకొనే ఇటువంటి హింసారూప ఆస్తిక్యానికంటె నాస్తికులైపోతే మేలుగదా ? ఈ జంతునాశనమైనా తప్పుతుంది.

వెం॥ రా: గోపాలరావుగారు! మొన్న మీరుచేసిననేరాన్నిబట్టి అన్ని సంఘాల్లోనుంచి మిమ్మల్ని బహిష్కరించాం. కాబట్టి యీకోలుపుల్లోకి మీరు రా తగరు.

రంగా:—మమ్మల్ని మీజాతరలో చేర్చుకొనకండి. అది మాకూ యిష్టమే. జీవహింస తప్పించటంకొఱకే వచ్చినాము. అదిమాత్రంఆగితీరాలి.

కుమ్మ: మొక్కున్న మేకలన్నీ యేమైపోవాలి ?

మధు: కల్లుభాండాల్లోపడి కాగిపోవాలి. ఈహింసకుతోడు కానరాక కాపురాలు కూల్చే ప్రతిహింస త్రాగుడు.

వెం॥ దా: గాంధిమహాత్ముని భాగ్యమాయని మద్యవిక్రయంపోయింది కాని వెనుకటికంటె ఇప్పుడు త్రాగుడు కెట్టింపైనది. అప్పుడు బీదలు. ఇప్పుడు ధనికులు, బీదలు.

సుబ్బా: కూలీనాలీచేసి బ్రతుకవలసిన జాతివాడివి నీకెందుకోయ్ ఇటువంటి వేదవాదాలు.

వెం॥ దా: — చదువుకొని ఇంత జ్ఞానం సంపాదించుకొన్నానుగనుకనే.

సుబ్బా: అదే ఇంతకొంపముంచింది. మాలవాడికి నీకు చదువెందుకు? మా వెధవలంతా మీలో కలిసిపోబట్టి నలుగురులోకిజేరి ఇంత గట్టిగా మాట్లాడగలుగుతున్నావు.

వెం॥ దా: తొందరపడి మాట్లాడతారేంబాబు! పుణ్యం పాపం తెలుసుకొని భూతదయ కలిగి బ్రతకటం తప్పా ? మీ ఆచారాలతో మాకు పనిలేదు. మా చదువులు మీ కెప్పుడూ భంగంకలిగించవు. చదివి దైవదృష్టితో మా దేహాలను, గేహాలను, సంఘాన్ని బాగుచేసుకోనివ్వండి. ఇందులో దోషమేమున్నది ?

సుబ్బా:— ఇంతవరకు వచ్చినతర్వాత ఇంకా యేమాచారాలు? అన్నీ ఒక్క పెట్టున భస్మీపటలమైపోయినై.

వెం॥ దా:— దానికి మీరు భయపడకండిబాబు. గొంతుకోతల దేవుళ్లు, మాయలమారి దేవుళ్లు, మాయమైపోయి నిజమైన దేవుడు బయటపడతాడు.

సుబ్బా: (తనలో) శాంతగా వీడుమాట్లాడేమాటలన్నీ హృదయంలో ఏదో ఆందోళనపుట్టిస్తున్నాయి. ఏమిటబ్బా! (ప్రకాశం) దేవుళ్లే కాదు ప్రపంచమంతా యేదోప్రవాహంలోబడి కొట్టుకు పోతున్నది.

వెం॥ దా: అవునుబాబు! మనవంటివారంతా కళ్లుతెరచి చూడాలి. ఇప్పుడొక నూతనయుగం ప్రారంభమైనది.

వెం॥ రా: (తనలో) ఏమోననుకున్నానుగాని వీరిమాటల్లో ఏదో ఆవేశం పెరుగుతున్నది. ఇది అమ్మగారి సంబంధం కాదుగదా? (ప్రకాశంగా) గురులింగం! ఈమాటల కేమిగాని పని జరగనివ్వండి.

వెం॥ దా: జరగనివ్వండి చూస్తాం. ఓరే పుల్లడు! నాగులు! నేను చెప్పేది చక్కగావినండి. చేసేవి చెడ్డపనులుచేసి మేము దీనులం హీనులం అంటేకాదు. ఇటువంటి జీవహింసాకార్యాలను మాను కొని, త్రాగుడు పూర్తిగా మరచిపోయి, చదువుకొని, సత్యం వదలకుండా మీకుటుంబాలను మీరుపోషించుకొంటూ వుంటే మిమ్మల్ని ఇతరులెందుకు హీనంగా చూస్తారు? మీనాళాలలో మానవరక్తం ప్రవహించటంలేదా? మీ హృదయాలలో ఈశ్వర తేజం ప్రజ్వలించటంలేదా? మీ చేతలలో దయాదాక్షిణ్యా శాంతాలు లేవా? ఇన్నీవుండి తుచ్ఛవాంఛలకులోనై నీచులుగా పరిగణింపబడుతున్నారు. కాబట్టి ఈ కొలుపుల్లో మాకు సంబంధంలేదని చెప్పండి. వంకకత్తులు వారికె పారవేయండి. పదండి పల్లెకు. మనకులానికి రంగారావుగారు చేసిన మహోపకారం జ్ఞాపకం చేసుకోండి. వారి ఉపదేశాల్లో గురుత్వం వుంచండి.

సుబ్బ: పుల్లన్నా! నిజంగా రంగారావుగారంటే మనపాలిటి పరమ దైవంరా! వారు చెప్పినట్టంతా నడుచుకోవటం మన విధాయకం. పారెయ్యండిరా వారికత్తులు వారికి. పదండిరా పోదాం.

నాగ: పదండిరా! పదండి! రంగారావుగారికి జేయ్.

పుల్ల: వెంకటదాసుగారికి జేయ్.

( తెర పడును )

శ్రీ ర స్తు

# న్యా యం

## ఆ ర వ అ ం క ము

### 1 వ ర ం గ ము

( రామశాస్త్రిగారియిల్లు ంఃమశాస్త్రి, వెంకటరెడ్డి కూర్చుండి మాట్లాడుకొనుచుందురు. )

వెం॥ రె: శాస్త్రిగారు! ఏమోననుకొన్నాంగాని మీ కుమారు డన్ని విధాల సమర్థుడేసుమా ?

రామ: రెడ్డిగారూ! మొదట్నుంచీ ఎన్నివిధాల మందలించినా మాట వినక తిరగటం మొదలుబెట్టినాడు. అన్నివిధాల చెడినాడనే అనుకొన్నాను. కాని వాడు నడిపించే ప్రతిసంస్కారములో కొంత సత్యం వున్నది.

వెం॥ రె: ఏ సత్యం కనపడందే ఇంత భల్లూకపుపట్టుతో మనమెన్ని విధాల కష్టపెట్టినా కార్యరంగంలో దూకగలుగుతాడా ? ఇప్పుడు పల్లెకువెళ్ళి చూడండి! గ్రామం దానిముందు ఎందుకూపనికిరాదు ఆ బజార్లూ, ఆ యిళ్లూ, ఎంత అందంగా, ఎంతఆరోగ్యంగా వున్న య్యనుకొన్నారు. సంవత్సరం నిండాగాలేదు వీరక్కడ ప్రవేశించి. ఇప్పుడు హరిజనులు హరిజనులుగా లేరు, పట్టణవాసులవలె వున్నారు.

రామః ఇంతమంది యేకముఖంగా పవిత్రులైనారంటే నాకూ ఆనం దంగానే వున్నది.

వెం॥ రె:— మనబ్బాయితోపాటు పాటుబడుతున్న వెంకటదాసు మాలల్లో-బుట్టినాడనడమేగాని, ఆప్రశాంతగుణం - ఆవిమర్శనాపటుత్వం - ఆ నిశ్చలదీక్షతో చేస్తున్న మానవసేవ వుత్తమ వంశంలోబుట్టిన వారైనా చెయలేరు.

రాము: ఉత్తమవంశంలో బుట్టితేమాత్రం యేంఫలం? గుణాల్లో వృత్తమత్వం లభించటం మిక్కిలి దుస్తరం.

వెం॥ శె: ఇప్పటికి వారిద్దరూచేరి పల్లెనంతా స్వర్గంగా మార్చారు. ఇదివరకు పంచములకున్న దురభ్యాసాలన్నీ పోగొట్టి సంపూర్ణ నీతి, న్యాయం, విద్యా, ధనం గలవార్నిగా జేశారు. మొన్న మాకూలీలసమ్మె చూడండి చివరకు మేమే నిగ్గలేక లోబడ్డాము.

రాము: రెడ్డిగారూ! మావాడిని మహామూర్ఖుప్పట్టు. జాతరలో మాత్రం యేమైంది? విజయం వారిదేగా?

వెం॥ శె: జాతిమత భేదాలు లేకుండా కుటుంబాలన్నీ యేకమైనై. ఇక యెంత విత్తంగలవారంగా వున్నా సంఘసంఖ్యలో తగ్గిపోయి నాం. కనుక ఇక మీపట్టుదల విడిచిపెట్టి అబ్బాయి నింటికి పిలి పించండి. మంచిచెడ్డలు విమర్శించలేనిలోపం మనయందేయున్నది.

రాము: మొన్నటి కలరాలో వాలంటీర్లతో కలిసి వాడుచేసిన సేవ జూస్తే మానవుడంటే వాడేననిపించింది. గ్రామంలో కంటే పల్లె లోనే జారటంకూడా చాలాతక్కువ.

వెం॥ శె: దాన్ని మెచ్చుకొనే ప్రభుత్వంవారు వీరుకోరినట్లంతా పల్లెకు యెన్నో వరుమానాలిచ్చారు.

రాము: ఇప్పటికనుకొన్న పనులన్నీ పూర్తయినయ్యట. ఇక ఆవివా హంకాస్తా ముగించుకోవాలని చూస్తున్నాడు.

వెం॥ శె: అదెట్లా తెలిసింది.

రాము: వాడి వ్యవహారాలన్నీ బహిరంగంగా నడిచేవేగాని రహస్యం మాటే వుండదు. వీడి ప్రతికార్యం ప్రారంభంలో అతివికటంగా తోచినా అంతానికది, ఒక సంస్కారంగా మారి విజయంపొందు తున్నది. వాడి జీవితం అటువంటిది.

వెం॥ శె: గంగాధరశాస్త్రిగారి సంబంధంకూడా చాలా మంచిదే. మొదటినుంచీ ఇంతిపేరూ ప్రతిష్ఠలూ సంపాదించిన కుటుంబం.

రామ: మంచి శాస్త్రవేత్త. ధనికుడు. కొంత పలుకుబడీ వున్నది. ఆయనకూ ఈ నూతన సంస్కారాలంటే మహాభిమానం.

వెం॥ రె: కనుకనే ఎవ్వరినీ లక్ష్యపెట్టకుండా తనకు తగినవాడని యెంచి మాలవాడలోనున్నా అబ్బాయికి బిడ్డనిస్తున్నాడు.

రామ: మావాడు అప్పుడప్పుడూ వారింటికి వెళ్లేవాడు. నిర్భాగ్యురాలుగావున్న ఆబిడ్డనుచూచి జాలిపడి వివాహం చేసుకుంటానని వుంటాడు. వాడి హృదయం చాలామెత్తనిదిలెండి. రేపు గంగాధరశాస్త్రిగారిని పిలిపించి విధ్యుక్తంగానే సంబంధం మాట్లాడి వివాహం జరిపిస్తా.

వెం॥ రె:– అవస్యం. నాకు చాలా సంతోషం.

రామ: తమరుకూడా దయచేయండి.

వెం॥ రె: నేనేమిటి గ్రామస్థు లందరినీ రప్పిస్తా. సెలవు. (లేచివెళ్లును; తెరపడును

## 2 – వ రంగము

( సుబ్బావధానులు పెద్దబజారున కుంటుచూ వచ్చును. )

సుబ్బా: హారేరామ హారేరామ, రామరామ హారేహారే.
వీడితస్సాగొయ్యా! ఎంతపనిజేశాడు పేరిశాస్త్రిగాడు. పరే కానీ చూతాం. మొన్న జయపురజమీందారుగారింట్లోయిచ్చే సంభావనసమయంలో నేను చదువుకోలేదనీ, సానిదానికి సమర్పిస్తాననీ, దొడ్డిదోవన మరలవచ్చినాననీ, గుట్టంతా బయటబెట్టి అదివరకు వచ్చినదాన్నికూడా వూడగొట్టించాడు. వారిచ్చింది వారికి చేరుకోగా వారి సేవకులిచ్చిన సంభావన ఇప్పటికీ కాలిమీద గుర్తుగా వుంది. ఈ పేరిశాస్త్రి ఎంతిపాండిత్యం కలవాడైనా సాటివాణ్ణి గదా? ఇదేనా చేయువలసినపని. సుబ్బావధాన్లతోపగంటే చులకననుకున్నాడుగామాలు, చూడు తమాషా ఏదోసమయంలో నాకుచేసిన ఈ పరాభవాన్ని వెళ్ళగక్కించకపోతేనా? (నడచుచు)
హారేకృష్ణ హారేకృష్ణ కృష్ణకృష్ణ హారేహారే.

( పేరిశాస్త్రి ప్రవేశము )

పేరి: ఓహో! సుబ్బావధాన్లా! ఏమండీ! ఎక్కడా దర్శనాలే లేవే?

సుబ్బా: (తనలో ముండకొడుకు వీడే ప్రత్యక్షమైనాడే. నేనంటున్న మాటలు కొంపదీసి వినలేదుగదా? (ప్రకాశము) అవునుగాని పేరి శాస్త్రీ! మన రామశాస్త్రిగారివిషయం నీకేమైనా తెలిసిందా? వారు ఎంతటి నైష్ఠికంగా నడుచుకునేవారు చెప్పు. పూర్వం నుంచీ వారి కుటుంబం జమీందారీ గౌరవంగా నడిచివస్తున్నది కాదు? ఇప్పటికి దానిగతి ఎలామారిందో చూడు.

పేరి: ఏమిటా నూతనవిషయం చెప్పవ్.

సుబ్బా: సంవత్సరంనాడు మాలల్లోకలిసిపోయిన కొడుకును నిన్న యింటికి రప్పించాడు.

పేరి:— రామరామ! పెద్దవారికే ఇటువంటి దుర్గుణాలుపుడుతుంటే ప్రపంచం యింకా ఏం బాగుపడుతుందండీ!

సుబ్బా:— ఇంతతో అయిందటయ్యా! ఇప్పుడు కొడుక్కు వితంతుకన్యను వివాహం చేయబోతున్నాడు.

పేరి:— ఆఁ అదిగూడానా? ఎవరిపిల్ల?

సుబ్బా:—నీకింకా యీగొడవ తెలియనేలేదా? గంగాధరశాస్త్రికూతురు.

పేరి:— ఆయనెలా అంగీకరించాడయ్యా!

సుబ్బా:— అంగీకరించక ఏంజేస్తాడు? ఆడపిల్లను చదివించిన ఫలం యిది.

పేరి: అందుకే మనపెద్దలు స్త్రీవిద్య పనికిరాదన్నారు.

సుబ్బా: నిన్న కొడుకు యింటికిరావటంతోటే గంగాధరుణ్ణి పిలిపించి అన్నివిషయాలు మాట్లాడి ఎల్లుండి సాయంకాలమని లగ్నం నిశ్చయించుకున్నారు. తథాస్తనుకొన్నారు. కాని పౌరోహిత్యానికి పంచములలో యెవరన్నా రావలసిందే కాని కులీనుడెవడూ దొరకడు.

పేరి: ఈగొడవంతా నాకేందెలుసు నేను వొప్పుకున్నానే?

సుబ్బా: అమ్మదొంగా! చెప్పవు. ఎంతవాడవోయ్. సంభావనలకెవ రైనా వస్తారా?

పేరి: డబ్బుదగ్గర కొచ్చేవరకు అన్నికట్లూ తెగిపోతై. అట్లా చూస్తుండు అంతా వెళ్లేవారే. బీదలైతే ఏవేవో ధర్మశాస్త్రాలు చూపి దూరంగా త్రోసేవారే. కాని వీరి రెండుకుటుంబాలు నిండు ధనవంతాలు. ధనంముందు ధర్మశాస్త్రాలు నోరువిప్పవు. కాని శాస్త్రుర్లుగార్లంతా చేయివిప్పేవారే. కాబట్టి నీవుకూడా రాకతప్పదు.

సుబ్బా: ఎందుకు నారెండోకాలింకా బాగుండిపోయిందనా?

పేరి: (నవ్వుచు) నీవిషయంలో గట్టిగాచెప్పి భూరిసంభావనయిప్పిస్తాను.

సుబ్బా: — ఏమో వస్తే సంభావనకురావలసిందేకాని భోజనానికిమాత్రం రాను. అంతా మాలకూడుజేసిన వారింటికి యేమొగంబెట్టుకొని వచ్చేది? వాడు వెంకటదానీనంట అక్కడ పెత్తనమంతా.

పేరి: భోజనాలకేకాని, ధనస్వీకారానికి నిషేధంలేదేమో. భోజనాలు కాందే కానీగూడా సంభావనివ్వరు.

సుబ్బా: అదుగో యేదోపితలాటకం నీవే తగిలిస్తున్నావు. గ్రంథ సాంగుడివి.

పేరి: లేకపోతే కందకులేని దురద పెండలాని కెందుకయ్యా! యథా రాజా తథాప్రజా. నలుగురు బోయినదోవే పోతే మంచిది. లేకుంటే మనకు మరునాడు పుట్టగతులుంటయ్యా?

సుబ్బా: పోనియ్యండి ఆసందట్లో నన్నెవరు చూస్తారు? అలాగేవస్తా.

పేరి: అదేనోయ్ నేననేదిన్ని. అంతా పైకలా కనిపించేవారేగాని పైసా చేతులో వేసేవారెవ్వరూలేరు.

సుబ్బా: నిజం నిజం. రేపు వెళ్లేటప్పుడు నన్నొకకేకవేసిపో. వెళతా.

(తెరవ్రాలును)

## 3 - వ రంగము

గంగాధరశాస్త్రిగారి యిల్లు. వివాహ మంటపం.

రామశాస్త్రి, గంగాధరశాస్త్రి, గోపాలరావు, మధుసూదనరావు, వెంకటరెడ్డి, వెంకటదాసు, సుబ్బావధాన్లు, పేరిశాస్త్రి, వెంకంభొట్లు. పెండ్లి అలంకారములతో రంగారావు, సుందరమ్మ.

రామ: శాస్త్రిగారు! వధూవరుల నాశీర్వదించండి.

(వధూవరులు నమస్కరింతురు)

పేరి: సుందరమ్మా! విద్యావతివైన నీవు, గుణవంతుడైన భర్తను చేపట్టటం చాలా పొగడదగిన విషయం. పుత్ర పుత్రికావంతురాలవై సుఖంగా జీవించు.

సుబ్బా: మీ జీవితాలు దేశసేవయందే వినియోగించుగాక!

రామ:— ఈవివాహం శుభప్రదంగా నిర్వహింపబడినందుకు సంతోషం.

గంగా:— మీయంతటివారు కార్యరంగంలో దుమికి యీ వివాహాన్ని నడిపించటంచేత భారతదేశం పవిత్రమైనది.

వెం॥ దా: ఎంతోపట్టుదలతో వున్నవారుకూడా న్యాయమెరిగి ఇంతటి పరివర్తనను పొంది ప్రపంచాన్నంతటినీ సమిష్టి కుటుంబంగా చేసినందుకు భారతభూమి వన్నెకెక్కినది. ధన్యమైనది.

రంగా:— మిత్రమా! వెంకటదాసూ! న్యాయాని కెప్పటికైనా విజయమేసుమా!

వెం॥ దా:— ఇదంతా భారతమాత భాగ్యం. మాపుణ్యం.

వెం॥ రె:— ఈసమస్తం రంగారావుగారి సద్భావవిశేషమేగాని మరొకటి గాదు.

గోపా:— ఇక పండితసన్మానాలు పూర్తిచేయండి.

(వెంకంభొట్లు వెళ్లుచుందును

వెం॥దా:_ శాస్త్రిగారు! శాస్త్రిగారు! వేళతారేమండి. సంభావన తీసు కొని వెళ్లండి!

వెంక: సంధ్యకువేళైంది. వెళ్లను.

మధు: శుభాశుభాలకన్నింటికీ తామే ముందై రాత్రిఅనీ పగలనీ యెఱుగకుండా సంచరిచే వీరికూడా సంధ్యయా? ఇది ద్వితీయం గనుక ఈసంభావన పనికిరాలేదేమో?

గోపా:_ ఓహో! ఇదా వీరినైష్టికత్వం. ఎంత అంధదృష్టి? స్త్రీ స్త్రీగా జన్మమెత్తినంతమాత్రాన మానవత్వం నశింపదు. కొన్ని స్వాతంత్ర్యపు హక్కులు మనముంచుకున్నా అర్ధాంగులని మనంబెట్టిన పేరుకొఱకైనా కొన్నిహక్కులు వారికివ్వటం న్యాయం. అబలలైనందుకు వారుమాత్రం పతివ్రతలుగా ఉండాలి - మనం ఏకపత్నీవ్రతస్థులం కానక్కరలేదు. వారు వాకిలినైనా చుండరాదు - మనం యింటిలో భార్యనుబెట్టి ఇల్లు పొలం తాకట్టుబెట్టి సానివాడల్లో సంచారాలుచేయాలి. బాల్యంలో భర్తబోతే తిరిగి వివాహం చేసుకోరాదు - మనం యెనభైయోపడిలోనైనా యెనిమిదోపెండ్లివరకు సిద్ధంకావచ్చు.

వివాహమనేది వంశాభివృద్ధికేకాని శునకవాంఛను తీర్చుకోటానికి కాదుగదా? ముగ్గురు నలుగురు బిడ్డలతండ్రి మూడో పెండ్లికని ప్రాకులాడటం యెందుకు? కామమే ప్రధానంగా జూచుకొని కనుగొన్న కాంతలతోనెల్ల సిగ్గువిడిచి వెకలిమాటలు మాట్లాడుతూ తిరగటం యెందుకు? సిగ్గనేది, న్యాయమనేది స్త్రీకేకాని పురుషున కక్కరలేదా?

ఇన్నిచేస్తూ ఆడది చదివితే చెడుతుందనీ _ చిన్నబిడ్డలకు పెళ్లిజేస్తే పిల్లలతల్లికూడా కావలెనంటుందనీ _ మూఢురాండ్రను చేసి కూర్చోబెట్టటమా? మనం చదివి, వారిని చదువనిచ్చి మన కుటుంబాలను యెందుకు నిత్యానందంగా చేసుకోరాదు?

మనకుండవలసిన నీతులన్నీ మన్ను జేసి, ఎంతలేబ్రాయంలో నైనా విధవకావడంతోటే వంటింటిపనుల్లో పారవేసి, రెండు వేళలా నిండుగా అన్నంబెట్టక, ఒంటినిండా గుడ్డనివ్వక, కంటి నిండా నిద్రబోనివ్వక ఆజన్మాంతం కష్టపెట్టటం తగినపనేనా ?

ఎవరికివారు ఇంటిలోని విధవబిడ్డనుచూచి అంగలారుస్తూ సంఘమేమో అంటుందని_ పరలోకం రానివ్వదని_ శాస్త్రం కొడుతుందని_ ఈ వివాహాలను తప్పిస్తున్నారుగాని, ఏదీ బుద్ధి పూర్వకంగా_ ఈశ్వరసాక్షిగా_ శాస్త్రసమ్మతంగా_ ఈపెండ్లి కూడదని అనడం చూతాము.

పేరి:_ గోపాలరావు చెప్పినదానిలో న్యాయం లేకపోలేదు. కాలాను గుణ్యంగా ఆచారాలు మార్చుకుంటూనే వుండాలిగాని, ఎప్పుడో కృతయుగంనాటి పద్ధతులనే అనుసరింపజూట్టం అవివేకమే.

సుబ్బా:_ ఇంతకూ శాస్త్రిగారి సౌజన్యం, శీలం ప్రశంసార్హం.

వెం॥ రె:_ ఇంకా సందేహంకుండా నా ?

వెం॥ దా:_ మీవంటి మహనీయుల హృదాయాలు ప్రేమమయం కావటంచేత భారతభూమి స్వర్గమైంది.

సీ॥ ధనమె పావనమంచు దలచినవారికి
సమకూరె కృప బీదసాధులందు
మును మూఢవిశ్వాసమున నున్నవారికి
స్వస్తివాచకమయ్యె జంతుహింస
అనయంబు ఘనసనాతనులైన వారికి
రూపరె నస్పృశ్యతా పిశాచి
నిఖిల సంస్కారముల్ నిరసించువారికి
పథ్యమయ్యె పునర్వివాహవిధులు

గీ॥ తొలుత భేదభావంబులతోడ నున్న
ప్రజలు క్షీరనీరంబుల న్యాయమునకు
చేయుచుండిరి సుఖముగా జీవయాత్ర
పావనంబయ్యె నేటికి భరతభూమి.

భరతవాక్యము

గీ॥ ధరణి సంపూర్ణసస్యయై తనరుగాక
జాతివైషమ్య మెల్లెడ సమయుగాక
ఐకమత్యంబు ప్రజలలో నలరుగాక
న్యాయమెంతయు విజయంబు నందుగాక.

## మా ప్రచురణలు

| | |
|---|---|
| ఆత్మభారతము | రు. 4_8_0 |
| చూడాల (పద్యము) | 1_4_0 |
| స్తోత్రమంజరి ... ... | 0_8_0 |
| సరోజముఖి (నాటకము) | 1_0_0 |
| భక్తభీమ ,, | 1_0_0 |
| రామశతకము (అక్షరమాల) | 0_2_0 |

